సదృక్షఫలప్రవాహామరుత్తరంగిణీప్రశంకాయమానా కలంక జాంబూనద సంపాదితాగణ్య పుణ్యస్వరూపం బగుజంబూద్వీపంబుఁ బ్రవేశించి, యంత.

సీ. మలయశైలనితంబవలయ చందనలతా
నిలయవైభవము వర్ణించుకొనుచు
మంగళప్రస్థాభ్రభరంగలగ్నమనోజ్ఞ
శృంగలక్షణము లీక్షించుకొనుచు
మైనాకవివిధప్రసూనవార్తానూన
నానాకటకకాననములు గనుచుఁ
హల్లకాచలసరోహల్లకామోద సం
వేల్లితానిలము సేవించుకొనుచుఁ
గుతుక మొప్పంగ మఱియుఁ ద్రికూట చిత్ర
కూట మణికూట వృషభ క్రౌకుభ మహేంద్ర
వారిధా రేంద్రకీలపర్వతములెల్ల
మెట్టి తత్పుణ్యభూములు చుట్టిచూచి.

క. చనిచని కాంచిరి విద్రుమ
వనరాగద్విగుణితాంబువర్ణముచేతం
గననొప్పు తామ్రపర్ణిఁ
వనసిధివరవర్ణినిఁ నవశ్రీపర్ణిన్.

గీ. కాంచి యిది పాండ్యభూపాలకాంచిత మగు
కేళిదీర్ఘిక యిది మంచికెంపురాలు

గలుగుచుండెను గని యిది కలశభవుఁడు
నిత్యసంధ్యావిధులు తీర్చు నెల వటంచు.

వ. అందు నందఱుఁ దీర్థంబు లాడి,

క. ఆ తామ్రపర్ణి చెంగట
నా తామ్ర ప్రచురకిసలయద్యుతి నవ సం
జా తామ్రవర్ణముల్ వి
ఖ్యాతంబై మించునట్టి గజతీర్థంబున్.

వ. కనుంగొని తత్తటంబున నిల్చి, యందఱు నానందంబు తోడ.

సీ. లాలితశాలకై వాలజాలచ్ఛాయ
నీల కాయంబు వన్నియఁ బొసంగఁ
బై నిండఁ బర్వెన పద్మపరాగముల్
హాళిఁదితాపిత్రై చాయ ననుకరింప
నగజాగ్రదివ్యనీలాంబుజాత శ్రేణి
చాఁపిన తొండంపు జాడ నమరఁ
జార్వతటోద్గీనపక్షినాదంబులు
ఘంటాఘణాత్కార గరిమఁ బెనుప
మారుతోద్ధూతశీకరమండలంబు
ఘనమదమధువిభ్రమము దెల్ప ననవరతముఁ
దనరు గజతీర్థ మనుట సార్థముగఁ జూపె
నద్భుతంబుగ నీసరోజాకరంబు.

క. అని పొగడుచు నా చెంగట
ననుపమతపమునఁ దెలంగు నాత్రేయుండర్ల

మునిఁగని, యాతీర గరిమ
మనఘా! వివరింపు మనుడు నతఁ డిట్లనియెన్.

చ. కరిణులు గొల్వ నొక్కకరి, గాటపు వేడుకఁ దొల్లి భూధరాం
తరఘనకందరాటవుల దాపుల మేఁపులు మేసి మేసి మై
బిరుసుగ నెండవేఁడిమిఁ దపింపఁగ దెప్పరమైన దప్పిచే
దిరుగుచు నెందు నీరు గలతెంకులు గానక దీనకంఠమై.

క. మన్నులు రేఁగఁగ నేనుఁగు
మన్నీఁడడవిఁబడి యొండమావులు ద్రావం
గన్నలఁ బఱచుచు నడియా
స న్నొగులుచు వ్రాత పోలి జాలింబడుచున్.

క. కొన్ని పెంటియేనుఁగులుఁ దానుజోకయై
మూఁకదప్పి, దప్పిమోము లెండఁ
జల్లగాలిజాడ మెల్లన యరసి, యా
సరసి దరిని నింపు బెరసి యంత.

క. కడుపులునిండఁగ జలముల్
వడిగ్రోలెం దొండములను వారక సరసిం
బుడబుడ ముంచుచుఁ బ్రక్కలఁ
గుడియెడమకుఁ జల్లికొనుచుఁ గుంభీంద్రంబుల్.

క. నిండార జలముద్రావియు
వెండియు వెండియును గడుపు వెలితిగఁ బైపై
నొండొండ గ్రోలి జలరుహ
షండంబులతోడ గ్రీడ సల్పుచునుండన్.

క. మకరంబొక్కటి యక్కరిఁ
గికురించుచు వాడికోఱగిఱకలఁ బదముల్
వెకలించిన, నించుక కన
లకయుండుబట్టె బిట్టు లా వడరంగన్.

ఉ. పట్టిన నగ్గజేంద్రమును బాదములం బెకలించిచూచి, యి
ట్టట్టు చలింపరా కతిభయంబున మస్తకముం దటంబులం
గొట్టుచుఁ,గూఁతవెట్టుచునుగుంభయుగాంతరసీమహాస్తమున్
బెట్టుచు నార్తిహారి హరిఁ బేర్కొని యుచ్చతరస్వనంబునన్.

ఉ. ఓహరి యోదయాంబునిధి యోభవబంధరుజాపహా మహా
దాహముచేత సంబువులు ద్రావఁగ నిచ్చటఁ జేరి, యీజల
గ్రాహముచేతఁ జిక్కువడి గాసిలితి న్ననుఁగావవే యసం
దేహముగాఁగ నీవ యిట దిక్కుసుమీ ఖగరాజవాహనా!

క. అనిపల్కుడు కరిమొఱఁదా
వినియో వినలేదొ యింత విస్మయముగ నం
తన దీనభక్తరక్షణ
ఘనుఁడు మురాంతకుఁ డనంతకరుణ దలిర్పన్.

సీ. తనుబిల్చినప్పుడ వినికోనుపడెనంచు
మకరంబు కరి రేకుమడఁచునొక్కొ
విభుఁడు గల్గిన మొఱవినఁడె లేఁడని దంతి
జడిసి ప్రాణము లేడ విడుచునొక్కొ

యార్తులరక్షింతు ననిపల్కుచుండెను
బిరుసునేటికి లేక జరగునొక్కొ
యుంకించివైచిన యురువడి నేనియుఁ
జక్రంబు వక్రంబుఁ జఱచదొక్కొ
యనుచుఁ దార్క్ష్యుంకు మదివిూఱి చనఁగవాగె
నిఱికియొత్తుచు నచ్యుతుఁ డేగుదెంచెఁ
దనదు దర్శనమును సుదర్శనము నపుడు
చక్రపదనక్రముల నొక్కసారెఁ బొదువ.

క. హరి గరుడుల రుచు లత్తఱి
సరిగా నొండొండ తీవ చాలుగఁ దగ నం
బరమున గన మెప్పుడును గం
ధరమణిధనువ్రులని య్యాత్మఁ దలఁచిరి వేల్పుల్.

క. కరి తలఁచుట మునుపో హరి
కిఁ దలఁ గరమిడుట మునుపొ కాదగు నని యొం
డొరులం బలుకుచుఁ దలఁచిరి
యరుదుగ సురలలికరంజితాంజలు లగుచున్.

క. చక్రపదసార్వభౌముని
యాక్రందన రవమునందు నైక్యము నొందెం
జక్రికరచక్రవిదళిత
నక్రార్తరవంబు వెలుఁగునన్ సురలుండన్.

క. హరిహస్తస్పర్శనమునఁ
గరియును గరిభావ మెడలి గంధర్వుండై
సురమార్గంబున నాయం
బురుహాక్షుం భక్తరక్షుఁ బొగడుచుఁ జనియెన్.

గీ. నాటఁగోలెను గజతీర్థనామ మొదవె
నీసరోవరమునకు మునీంద్రులార!
యిందుఁ గ్రుంకిన జనులకు నిందుధరుని
కంటె మిక్కిలి సంపద గలుగుచుండు.

వ. అనిన విని యక్కరివరదుని మహత్త్వంబు చిత్తంబుల హత్తి నృత్తంబులాడుచుండ.

సీ. వందె మిమ్మని లక్ష్మి పంతంబు కోనన
నెద కౌస్తుభ మెడల్చి యదరవైచి
పడఁతి పాదములందుఁ బావలు గదియింపఁ
దొడిగియుఁ దొడుగక తొలఁగఁద్రోచి
కదిసి విష్వక్సేను కైదండ యొసఁగియుఁ
గడువేగ మడరంగఁ గడకు నూఁకి
బరిమేని గరుడుని నురుదవతిమై నెక్కి
పదపదమని సారె పన్నుఁ సోఁకి
సురలు గని మ్రొక్క యసురులు సుడిగి స్రుక్కఁ
జక్రమున నక్రశిరమును జక్కుజేసి
హస్తమున హస్తిమస్తంబు మస్తరించి
వెలయు శ్రీహరి శుభము గావించు మాకు.

క. అని పొగడుచు నాతీర్థం
బునఁ దానములాడి వెడలి మునిశేఖరు ల
వ్వనజాతభక్తరత్నుల
ఘనకథలు నుతించికొనుచుఁ గౌతుకమెసఁగన్.

మ. శుభతీర్థంబటుదాఁటియవ్వెఁ మునుల్ హిండత్త్రోపాసాంద్రచం
ద్రభటాభంగఘటీనటాయితము లానందంబునొందింపఁగా
శుభవారిందనువల్ దొలంచి యవ్వైలక్షసాంపొందునింద్రోపల
ప్రభలన్ వెల్గెడు బాలకృష్ణు విభవభ్రాజిష్ణు సేవించుచున్.

క. సీతాపతిదోర్వైభవ
కేతువు దశవదనమదనఖేలైకకథా
హేతువు తాపసజనజీ
వాతువు సేతువును జూచువాంఛలు వెలయన్.

తే. అవ్వలనసం జని రనిన విని యమ్మహర్షు లత్యంతహర్షంబునం
దరువాతివృత్తాంతంబు వివరింపు మని యడుగుటయు.

మ. భువనాపూర్ణపిచండచండదనుజాంభోజాతవేదండ దం
డవినమ్రామృతకుండ కుండలిపథాట్వావైభవాఖండ ఖం
డవిధూత్తంసకకాండకాండకుమారాండద్ధామమార్తాండతాం
డవితోద్దండశిఖండిమండలవిభాడంబాంబుదోజ్జృంభణా!

క. బంహిష్ఠనిష్ఠురాశుగ
సంహతిసంహృతనిశాటఘటామహీభృ
త్సింహా సతతోపనిషదుప
బృంహితవేదైకమూర్తి భేదవకీర్తీ.

పంచచామరము.

ఘనాఘనాభతారకప్రకాశ భక్తరంజనా
జనావనాభుజాగ్రచక్రజర్జరత్పలాశనా
దినాధినాథయూథతేజ దిక్ప్రసిద్ధశాసనా
సనాతనాసుధామృగేంద్ర చంద్రజిద్యశోఘనా.

గద్యము.

ఇది శ్రీరామ చంద్రసాంద్రకరుణాకటాక్షలబ్ధ సిద్ధసార స్వతవిశేషనిరర్గళవాగ్వైభవాశేషసరససాహిత్యకళాభోజ సత్య సంభాషితముఖాంభోజ సకలసామ్రాజ్యధౌరేయ నిరతావా తాన్నసత్రసంతోషిత ప్రతిదివసపంచాశత్సహస్రభూసుర బహువారావర్తిత మహాదానవైభవావర్తిత భాసుర నిజనామాంకితాకళంక వస్తుసమగ్రి బహుళాగ్రహారభూషిత చోళధరామండల నిఖిలభోగనిర్జితాఖండలసాధిత సముద్రాంతరద్వీపపరనృపాలసంస్తుత ప్రతాప నేపాళభూపాలస్థాపనాచార్య కర్ణాటరాజపూజనీయ ధౌరంధర్య రామసేతుశ్రీరంగవిజయరాఘవపుర కుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపితరామభద్ర సర్వజనసంభావిత గాంభీర్య ముద్రావినిర్జితసముద్ర సదాశ్రితభరణదీక్షాదక్షదక్షిణ సింహాసనాధ్యక్ష రాజాధిరాజసన్నుతాసాధారణ శౌర్యదిగంత ప్రసిద్ధతరౌదార్య సుజ్ఞానజనకసతతసంసేవితజనక పోషితవిద్వత్కవియూథ భువనశోభితగుణసనాథ బలవత్పరిగృహీత సామంత

మహీకాంత విమోచనశ్లాఘనీయబాహాబల మూర్తి మాంబాగర్భశుక్తి ముక్తాఫల చిఃచెవ్వయామాత్యతనృపాలపుత్ర సజ్జనస్తోత్రపాత్ర రూపరేఖా విజిత కుసుమసాయక శ్రీరఘునాథనాయక ప్రణీతంబైన వాల్మీకిచరిత్రం బను మహా ప్రబంధంబు నందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# వాల్మీకి చరిత్రము.

## ద్వితీయాశ్వాసము.



కాంతాకుచభద్ర
శ్రీకాంతభుజాంతరాళ శీతలకరుణా
లోకప్లావితనత యత
సీకుసుమసమానధామ శ్రీరఘురామా !

వ. అవధరింపు మప్పర్వతుం డమ్మునుల కిట్లనియె నవ్విధంబున
నమ్మునీంద్రులానందంబున.

క. దక్షిణదిగ్భాగమునఁ బ్ర
దక్షిణగతి నరిగి యరిగి దర్భశయనముఁ
వీక్షించి సేతుమూలా
ధ్యక్షుఁ శ్రీరాముఁ గొలిచి తద్దయు వేడ్కన్.

సీ. చక్రతీర్థంబున స్నానంబు గావించి
బేతాళవారిధి స్నాతులగుచుఁ
బాపవినాశినీ ప్లావనం బొనరించి
సీతాసరస్సునఁ జెలఁగియాడి

మంగళతీర్థసంపర్క మానందించి
యమృతవాటికను దేహములు దోలఁచి
లక్ష్మణతీర్థఖేలనమున నలరుచు
రామ తీర్థంబు పూరములఁ గ్రుంకి

శంఖచక్రజటాతీర్థ జలములందుఁ
దానములు చేసి గంధమాదనసుగంధ
మందరసుగంధవనమందమందగంధ
వాహముల దేహముల శ్రమ వ్రాల్చి మ్రోల.

గీ. వెండియును వారలు హనుమత్కుండమునను
బ్రహ్మకుండంబునను దీర్థరాజమైన
కోటితీర్థంబునను ధనుష్కోటియందుఁ
గ్రుంకులిడి రామలింగంబుఁ గొలిచి నిలిచి.

---

మహాస్రగ్ధర.

చని మాపుల్ కాంచిరంతట్, సరభసవిసరత్సాంద్రవీచీకరీచీ
జనితోద్దామాంధకారస్థగితదశదిశాచక్రకద్యోతివిద్యో
తనకృత్పాతీరఝాటోత్తరళతరదృగంతప్రభా......

శ. ... ... ... ...

... లా

కాంచితపాతీనఘటా
చంచల్లుఠనములు సారెసారెకుఁ గనుచున్.

క. ఆలంకారార్థో ప
ధ్యాలంకారప్రకారదాకారమునం
గ్రాలు నల రామసేతువు
నాలోకించుచు మునీంద్రు లతిహర్షమునన్.

చ. పరిసరవిద్రుమద్రుమవిభాపటలంబుల డంబు నల్గడం
బొరిఁబొరిఁ గప్పనొప్పె రఘుపుంగవు సేతువుచూచి మోముని
శ్వరకులచంద్ర! యీజలధి కై వలినీతతి యిచ్చ గెంపురా
సరిపెణ నేన నీటుగన జందెపువాటుగ వైచనో యనన్.

క. బిట్టురువడి నూఁతేనుఁగు
లిట్టలముగఁ బోరవరుణుఁ డెప్పుడు నడుమం
గట్టించిన తెట్టన నీ
కట్ట సెలంగెదును శౌరికాంతిప్రవరా!

క. వారిధిరంగస్థలమున
జేరి తరంగమ్ములనెడు జెట్టులు పైపైఁ
బోరంగ నడుమ బలుపిరి
సారించిన సరణి సేతుసరణి చెలంగెన్.

క. ధరణీతరుణీమణికం
బరమగు నీయంబురాశి మధ్యంబున న
బ్బురపునెరిక యన సేతువు
గర మలరెడు వివిధతరునికరదంతురమై.

క. ఆలోకించితె సేతువు
నాలోకాలోకమహీధరా కోంచలమా
శౌల స్త్యజయ స్తంభము
వ్రాలి జలధిఁ దేలియాడు వగఁ గనుపట్టున్.

గీ. భోగికులపతిసంతతి భూమివలయ
వహనజాతపరిశ్రాంతి వదలనుదధి
పైకిఁ దేలుచుఁ దనసంధిభారమెడల
నిగడెనో యన సేతువు దగె నరేంద్ర!

ఉ. ఈవనరాశి మీఁదట శయించిన మాధవు గౌరవించి యిం
పావహిలన్ మహీమహిళ యాదటఁ జాఁచినహ స్తమో యనం
గా విలసిల్లెడున్ గలితకంకణనాదము లించ రాఘవ
త్స్మవరు సేతు వెంతయును గౌతుకమిచ్చు మునీంద్రచంద్రమా!

క. అనియిటులు వివిధగతులను
వననిధిఘనసేతుమహిమ వర్ణించుచు న
మ్మును లచటు గదలి బహుపు
ణ్యనదులు వనములును గాన నరయుచునుండన్.

మ. కననవ్యోం బురరత్న మొక్కటి,వియద్గంగాతరంగానుషం
గన దన్మందరగంధవాహవిధుతాంగ్రశ్రాంతి నృత్యద్వధూ
జనమంజీరఝణంఝణస్వనితచంచచ్ఛ్రీదశాలావిలా
సనవేందూపలసౌధయూథరుచి సంఛన్నాగ్రదిగ్భాగమై.

క. అదిగని మధురానగరం
బిదిగో దడవులకుఁ గంటి మీాకృతమాలా
నదిఁ గ్రుంకి సోమసుందరుఁ
బదరక సేవింపవలయుఁ బదపడఁ డనుచున్.

గీ. అఱిగివారలు హేమపుష్కరిణి చెంతఁ
గాంతతరమైన నీపవనాంతరమునఁ
దనరు కర్పూరసుందరుఁ దరుణ శీత
కిరణ శేఖరుఁ గని, నమస్కృతులు సేసి.

గీ. పంచశరభంగ కర్పూరపాండురాంగ,
మేరుకోదండ ధృతరమామిత్రకాండ
నాగవరహారకలధౌతనగవిహార,
నీకు మ్రొక్కెద మభవ యనింద్యవిభవ!

వ. అని సన్నుతించి వెండియుం జతుష్షష్టిలీలావినోది యగు
హాలాస్యనాథుని మహిమ భావించి.

సీ. మునులకందఁగరాని మోక్షంబు పక్షికి
దయచేసె నెవ్వాఁడు నయమెలర్ప
వివిధార్థములుగ ద్రావిడసూత్రములు సల
క్షణముగా నెవ్వాఁడు సంగ్రహించె
జంబుకంబుల దురంగంబులుగాఁ జేసి
యమ్మె నెవ్వాఁడు పాండ్యాధిపతికి

శ్రుతినిందకులఁ దామసుల శూలవిద్ధులఁ
గావించె నెవ్వాఁడు ఘనత మెఱయఁ
దట్టఁదలఁబెట్టి పట్టెఁడు పిట్టొసంగు
ముసలియవ్వకు నై మన్ను మోచె నెవ్వఁ
డట్టిలింగస్వరూపున కఖిలపతికి
సోమసుందరునకు నీకు జోడుఁగలరె.

వ. అని వర్ణించుచు నవ్వలం జనిచని.

శా. అంతం గాంచిరి వారిచూడ్కికనవద్యప్రోద్యదుద్యానముల్
వింతల్సేయుచు నుండఁ గా నుభయకావేర్యంతరీపాంతరా
క్రాంతాశాంతవిచిత్రగోపురఘనప్రాకారసౌధావళీ
ప్రాంతప్రోతమణిప్రభోజ్జ్వలనభోరంగంబు శ్రీరంగమున్.

క. కనుఁగొని కావేరీజల
మునఁ గ్రుంకుచు వేదశృంగమును బ్రణవమయం
బును నగు రంగవిమాన
మ్మునకు నమస్కృతులు సేసి మునికులచంద్రుల్.

సీ. మంచితెమ్మెరదూది నించిన గోదుమ
వన్నె పానుపుమీఁద నున్నవాని
వలచే దలాడగా నిలిపి వామకరంబుఁ
జెఱుతొడ పైఁజాఁచి మెఱయువాని
దృక్కోణఘనఘృణామృతము మీఱెడులీల
నెలనవ్వుచెక్కుల దొలఁకువానిఁ

దనపాదపద్మముల్ దప్పక సేవించు
నలవిభీషణుఁజూచి యలరువాని
సరస వాయక జయజయశబ్దములను
మించుపంచాయుధములను నించువాని
రంగతరళితమణిభూషణాంగవిభుని
రంగవిభుఁగాంచి చిత్తముప్పొంగుచుండ.

క. దండము లిడి నిలిచి సము
ద్దండమున శ్యాము రంగధాముం *పాశో
ద్దండజనకు నానాజగ
దండధురంధరు నుతించి రంచితఫణితిన్.

శా. కావేరీహృదయాభిరామపులినాకల్పాహితల్పంబునన్
శ్రీవామాక్షియు నీవు లోకములు రక్షింపంగనున్నాఁడవే
యోవిశ్వంభర యోకృపాజలనిధీ యోరంగ గేహాంచితా
శ్రీవత్సస్తుతవత్స వత్సలత రంజిల్లన్ మముం బ్రోవవే.

వ. అనిమఱియు మునిపుంగవు లాభుజంగశయనుం గని యంతరం
గంబుల భక్తియుప్పొంగుచుండ.

---

* పాశోద్దండుఁడు = బ్రహ్మ. బ్రహ్మకుఁ బాశముఁ జెప్పినందునకు, "కమలజా పాశంబు గాలాభ్రగ్రాహుగాఁ గాశాగ్రదండంబు గదయుఁగాఁగ." కుమార. ఆశ్వా ౧౦-౧౫౭ వ పద్యము. మఱియు "కవనచతుష్క విల్లద, రజోగుణవిల్లద పద్మపీఠవి | ల్లద, కలహంసవిల్లద, కమండలువిల్లద, పాశరజ్జువి | ల్లద." జగన్నాథవిజయము. ౮ గీ౬౧.

చ. తలగడ భామఁజేర్చుకొనిదయ్యమునెయ్యమునమ్మియేటిలో
నెలవుగ నిల్లుగట్టుకొని నీవిటులుండఁగ నోర్చుటెట్లు మా
వలనగు మానసాబ్జముల వాసము సేయు; కొఱంతలేదు నీ
యలమట దీఱెడుఁగా వినువిహంగమవాహనరంగమోహనా.

క. అన వారి ముగ్ధభక్తికి
ననయంబును నలరి రంగహరి నవ్వుచు మీ
మనసులలోనన యున్నాఁ
డను జనుఁ డని పలుక నజ్జటాధరవరులున్.

సీ. పంకజబంధుబింబస్థాయి త్రైలోక్య
మంగళదాయి శ్రీరంగశాయి
సకలజనానందసంధాయి గరుడతు
రంగమయాయి శ్రీరంగశాయి
సహ్యకన్యాతటాంచలకులాయి ప్రపంచ
రక్షణోపాయి శ్రీరంగశాయి
యఖిలదైవతసంపదతిశాయి యగణిత
బ్రహ్మాండకాయి శ్రీరంగశాయి

గీ. నిఖలజగదింద్రజాలంబు నెఱపుమాయి
యచ్చులకునెల్ల మొదలనచ్చైనవ్రాయి
కొలుచువార్కలపాలిటి తలఁపురాయి
రావణానుజదాయి శ్రీరంగశాయి.

గీ. రంగనిలయోపవాసంబు రంగనాథ
చరణపంకేరుహద్వంద్వసంభజనముఁ
జంద్రపుష్కరిణీస్నానసంగతియును
గలిగె మనలకు భాగ్యంబుకతననేఁడు.

వ. అని పొగడుచు నవ్వలం గడచియంత.

సీ. ఏవీటనిరవొందు నిందుశేఖరుఁ డప్డు
బృహదీశ్వరుం డనుపెంపుఁ గాంచి
యేపట్టనమునకు నేలికయా నృసిం
హస్వామి జనకామితార్థభూమి
యేప్రోలికెలన నెప్డెలరారు నీలమే
ఘశ్యాముఁ డిందిరాకాముఁడుండు
నేనగరమున నిర్హేతుకదయఁ బ్రోచు
నతకల్పవల్లి యానందవల్లి
యెచట విలసిల్లుఁదగ సుందరేశ్వరుండు
ప్రాంతకాంత కవేరకన్యాంబుధన్య
వివిధసస్యప్రశస్యయై వెలయుచుండు
నట్టి తంజాపురంబున కరిగి వేడ్క.

ఉ. అందలి సౌధయూధములయందము నచ్చటికేళికావనీ
బృందముచంద మాకెలన బింకపుఁజూపులకోపులించఁగా
నింపుముఖుల్ నటించువగ నెల్లఁగనుంగొనిపొంగి యౌరాపౌ
రందరపట్టణంబె యిదిరా మదిరాజిలె నంచు నెంచుచున్.

మ. చని రమాహ్మనులు నంతఁగొంతదవ్వుల్ సాంద్రద్రుమాకీర్ణ కా
ననముల్ కొన్నిటి దాఁటి, ప్రాగ్దిశరమానాథప్రభారమ్యహ
ర్మ్యని కాయంబులఁ జూడఁజూడఁ గుతుకంబాదక్షిణద్వారకం
దనర్చ నిల్చిన మన్ననారువసుధాధారు న్నిరీక్షించుచున్.

కం. సేవించి తదాకృతి మది
భావించి కరాబ్జయుగళఫాలస్థలికిన్
రావించి మిగుల సన్నుతి
గావించి ముదశ్రుపూరకలిత నయనులై.

సీ. పసిబిడ్డయైయుండి బండిరాకాసి కీ
లెడలఁదన్నినయాతఁ డితఁడు కాఁడె
కాళియభోగరంగస్థలంబునయందు
నృత్తమాడినయాతఁ డితఁడు కాఁడె
గొల్లయిల్లాండ్ర మక్కువలెల్లఁ గొల్లాడి
యేచుగాననునాతఁ డితఁడు కాఁడె
గోధనంబులకెల్ల గొడుగుగా గిరి వేల
నెత్తిపట్టినయాతఁ డితఁడు కాఁడె

గీ. యిచట సంపంగిమొగ్గలా యొతులసిగయుఁ
జేతబెత్తంబు మొలను బసిండిపిడియ
మును సమర రాజవేషముఁ బూనియున్న
వాఁడితనిమాయఁ దెలియంగవశమెయొందు.

గీ. అనుచు నారాజగోపాలు నభినుతించి
మించి కమలాపురంబును గాంచి యచట
భోగరాగంబులను జాలఁబొలుపుమీఱు
త్యాగరాజుల సేవించి హర్ష మెసఁగ.

చ. అనఘరతుల్ మునీంద్రులును నావల నావలమానశీతపా
వనపవమానముల్ శ్రమజవారిహరింపఁగ వేరజాతటీ
ఘనవివిధాగ్రహారములు కౌతుకముం బచరించుచుండఁగాఁ
గని రటఁ గుంభకోణము ధగద్ధగితేందుమణిప్రఘాణమున్.

వ. కనుంగొని యచ్చట.

సీ. చక్రపాణికి నమస్కారంబు గావించి
శార్ఙ్గపాణికిఁ గరాంజలి ఘటించి
కుంభేశ్వరునకు మ్రొక్కులు గూర్చి యలసోమ
నాథుల కభివందనములు సేసి
నాగనాథునకుఁ బ్రణామంబు సవరించి
విశ్వనాథునకును వినతిసలిపి
అవిముక్తశివునకు సాష్టాంగదండంబు
లాచరించి మఱియు నచటఁగలుగు
దేవతాతతి కెల్లను భావశుద్ధి
చెలఁగుచుండ నమోవాక మలవరించి
యభ్రసభఁ జూచుకుతుక మదభ్రలీల
నలర నమ్మౌనిపుంగవులవల దాఁటి.

క. శ్రీముష్ణముఁ గాంచి తప
శ్రీమించఁగ నిత్యపుష్కరిణిఁ గ్రుంకి దయా
భూమిన్ శ్వేతవరాహ
స్వామిన్ సేవించి యవలఁ జనిచని యంతన్.

ఉ. సాంజలియై పతంజలిమహాముని రంజిలిచూడఁగా దెసల్
మంజుల పాదనూపురఝుళంఝుళనధ్వని మ్రోయుచుండఁగాఁ
గెంజడ లాకసంబపరఁ గేవలతాండవమాడెఁ జిత్రభూ
భంజనుఁ డెంచు వేడ్కనలభర్మసభం గని విస్మితాత్ములై.

గీ. ఇందుశేఖరు సేవించి యెందుమాకు
భేదమెక్కడి దంచుఁ గాన్పించులీల
నందుఘనభోగవిభవంబు లందుచుండఁ
దిల్లగోవిందరాజులఁ దేటభక్తి.

వ. కొలిచి మఱియు నాభద్రసభాపతి విభవంబులు పరీక్షించి.

సీ. నొసలికన్ బెచుమంట మసలునో పైకన
నిడుద కెంజడగుంపు గడలుకొనఁగ
నిలమూఁదుపాదము వలగొన్న నూపురం
ఝొండొంశబ్దంబు లుగ్గడింప
భక్తులఁ బిలిచి సంపదలిత్తు ననుభంగి
ఢమఢమధ్వనిం గోడి ఢక్క మొరయ
వామాళిచంద్రుఁడు డాకాలియందియఁ దోఁచి
నిర్ద్వంద్వభావంబు నెరయఁ జేయ

హత్తి నై యొప్పు గెంటెంబు గుత్తముగను
గదిసి బంగులువాఱంగఁ గట్టి యసుర
మట్టి నాట్యంబు పలుపు నమాధవుండు
మాకువిభవంబు లొసఁగుచు మఱుచుఁగాత.

వ. అని సన్నుతించుచు నిలింపబాలికాకేళికాభవనాయమాన మాణిక్యఖచితచకచకితసౌధయూథప్రభాడంబరం బగుచిదంబరంబుఁ గడచి యంత.

క. అరుణాచలవిభుఁ గరుణా
వరుణాలయుఁ గాంచి కాంచివరమునిఁ దేజ
స్ఫురణారుణమణినానా
భరణాంచితు నేకమూతపతిఁ గనుగొనుచున్.

చ. చనిచని కాంచి రంత హరిచందనభూరుహచారువాటికా
వని వనితాసహాయ సురవైణికతల్లజ పాణివల్లకీ
ఘననినదానుకారి మణికందరజాలముఁ బంచవర్ణ కాం
చనకలవింకచక్రవిలసద్ధ్వనిశీలము శేషశైలమున్.

వ. కనుంగొనియు వేంకటమహీధరంబునవిశంకటమణితటంబులం దముకు మ్రోసినగతి మ్రుకు నాకాశగంగాతరంగిణీ నంగంబులు దొలంచి, యభంగభంగతాండవంబులం బెరయు, పాండవతీర్థంబునం దానంబులుగావించి, తటమహీరుహాకదంబక ప్రసవడంబరంబులం గదంబించు తుంబురుతీర్థంబునం గ్రుంకులిడి, మఱియు నఘాపనోదసమర్థంబు లగు ననేక

తీర్థంబు లాడుచు వచ్చి వచ్చి, మజ్జనపరమజ్జన పుష్కలా
యుష్కలావిష్కారిణియుఁ బాపిజనపాపకళంకదుష్కియాపం
కజకరణియునగు స్వామిపుష్కరిణిఁ దీర్థంబులాడి,

గీ. కువలయంబున నిదియవై కుంఠమనుచుఁ
గరముఁ జూపుచు భక్తిని గరముఁబ్రోవ
స్వామిపుష్కరిణీ తీరభూమి నలరు
వేంకటాచలనాథు సేవించి నిలిచి.

సీ. మణికిరీటంబు సంపద లేమి యనవచ్చు
నమ్మ ముత్తియపునామమ్ముఁ డంబు
మందహాసంబుల యందంబు వైసరే
సరిలేదు మెడకంటసరికి నెందు
నుదరబంధము నొప్పు లోహహోహాయెచ్చుల
మెచ్చువో బంగారు పచ్చడంబు
కటిఁ బసిండి కటారి కాంతి యెంతటివింత
మంజీరముల మంజిమంబు మేలు

ఉచితశృంగార మితనికి నొప్పుఁజూడఁ
డిట్టి చక్కనితండ్రి యెందేని గలఁడె
వలతు రీ వేంకటాచలవల్లభునకు
యోగిపురుషులు మదియందయునిచి చాల.

వ. ఇక్కరణి నక్కంజాతుని చక్కఁదనంబునకు మిక్కిలి చొక్కి
మఱియును.

లయగ్రాహి.

పంకజకరాకుచ విశంకటతటీరచిత
కుంకుమపటీరరుచి సంకలితవక్షో
లంకరణకౌస్తుభశశాంకరవిలోచన ప్రి
యంకరగుణప్రకర కింకరదమర్త్యా
శంకర నుతానతశివంకర సురాహిత భ
యంకర శరాగతకళంక భువనక్షే
మంకర మునీంద్రగణ సంకథితపావన ని
రంకుశమహామహిమ వేంకటగిరీశా !

క. సంకటము లెల్లఁ దొలఁగె వి
శంకట భవదీయవితతసతతఘనఘృణా
కంకటము గలుగమాకున్
వేంకటగిరినిలయ ! కాంతివిజిత కువలయా!

గీ. అనుచు నవ్వేంకటాద్రీశు నభినుతించి
మించి యవ్వలఁ జని మునుల్ గాంచిరంత
నంచితానందతీర్థసమర్థన సుమ
హాబలంబగునట్టి యహోబలంబు.

క. కాంచి మునిచంద్రు లచ్చటఁ
జెంచుల దొరయనఁ జెలంగి చెంచెతల కటా
క్షాంచలముల మరగిన నర
పంచాసను భక్తవరదు భజియించి తగన్.

సీ. హరి యిక్కడను సింహాస్యమై హిరణ్యాక
శిపుఁ జీరె ఖరనఖశిఖరములను
బక్షింపఁ డిటమున స్వాత్మికంబుగఁ దపం
బొనరించి విష్ణువాహనతఁ జెందె
గంగ నిర్జరులు డిగ్గంగఁ జేయఁగ నిందు
భవనాశినీధునీప్రభవహించె
నబ్జాక్షుఁ డిచ్చటఁ గుజ్జామ్రభూజమై
యమృతఫలములు దీవాళికిచ్చె

ననుచు నచ్చటి మహిమంబు నభినుతించు
కొనుచు నక్కొండఁగల తీర్థకుండలములను
దానములు చేసి మీఁది నెత్తంబువెంట
నరిగి, యవ్వల నమ్మునుల్ హర్ష మెసఁగ.

సీ. శవణిల్లు నెచటఁ గాష్ఠజ్యోతి విద్యోతి
తారణ్యనివహమై యహరహంబు
నొనరు నెచ్చట ద్రుణజ్యోతి ఖద్యోతిత
కీటమై ఘనగుహాగేహములను
గ్రాలు నెచ్చటఁ వాలుకాజ్యోతి సద్యోతి
మై హితశంబరసమూహమగుచు
నుండు నెచ్చట శిలాజ్యోతి యుద్యోతిత
శృంగంబులను రత్నభంగి నెపుడు

నలరు నెచట బరంజ్యోతి యతివిశుద్ధ
తరణి మణిశబ్దబిలదగద్ధగితభాగ
యోగసన్నద్ధ బహుసిద్ధ యోగిమతుల
నట్టి శ్రీపర్వతమునకు నరిగి రంత.

క. గంగాది తీర్థజలముల
నంగంబులఁ దోలఁచి మల్లికార్జునునకు నా
రంగగిరిమల్లికార్జున
రంగ త్కుసుమములఁ బూజ రచియించితగఁ.

మ. కనిరంతఁ భ్రమరాంబికఁ హారిమణీకాదంబకాదంబినీ
జనిశోభానికురుంబ నంబరచరీచంచత్కరాంభోజ భా
జనవాలవ్యజనానిలాంకుర చలాంచత్కుంతలం గాంతలం
ఘనజంఘాలమృగేంద్రవాహన నహిగ్రైవేయ శాతోదరిఁ.

క. కనుఁగొని సాంబశివ స్తవ
మున నమ్మకుటావబద్ధముగ్ధసుధాంశుఁ
వినుతించిన నాత్రిభువన
జనకుండును నద్భుతంబు సంఘటిలంగన్.

సీ. చుక్కల దొరయొకించుక నిక్క శిరసునఁ
బదినాఱుచెంగులపాగఁ జుట్టి -చు
తఱచు వెన్నెలలీను దళుకుసొమ్మొమ్ముపైఁ
దొలుపల్కులీనెడు తోడవునెట్టి

ముద్దులజింక ముమ్మొన పోటుముట్టును
　　సరవితో రెండుహస్తములఁ బట్టి
పెళపెళమను చెఱంగులరంగు లడరెడు
　　మూఁడువన్నెలకట్టు మొలను గట్టి
కెల్లుఱుకు ముత్తియఁపుఁజాయ గిబ్బనెక్కి
చారుతరహారశృంగారహారి యగుచు
ధారుణీధరరాజనందనయుఁ దాను
నమ్మునీంద్రులముఱోలఁ బ్రత్యక్షమయ్యె.

గీ. ఇట్లు సాక్షాత్కరించి దయా ఋషులఁగాంచి
దాంతిఘనులార! మీదు వరాంతికనుతి
మెచ్చివచ్చితి నిచ్చలు నిచ్చ హెచ్చు
కోర్కెలెల్లను మీకుఁ జేకూరుఁ గాక!

గీ. ఇదియుకాదెన్న నిచ్చటనెందు నెవరు
నెంతమాత్రంబు నుతియింతు రంతలోన
నేను వారి కభీష్టంబు లిత్తు వేగ
మౌనివరులార యీగిరిమహిమవలన.

వ. అని పలికి భుజగకంకణుం డాలింగమధ్యంబునం బ్రవేశించె; నంత నక్కాంచనాచలచాపస్వరూపావలోకంబున నానందంబు నొందుచున్న యమ్మునిచంద్రులుం గుటజప్రసూనవాసితంబు లగునుటజప్రఘాణంబుల నేణీశింభంబులుసంభ్ర

మంబున నక్కడక్కడ జాతివైరిగోను కామధేనూధన్యధా
రాసారంబులు చవిఁగొని త్రుళ్ళగింతలిడ వానివెంబడిం బరు
వులిడు మునిబాలికల కేళికలు విలోకించి, తదంగణంబుల
మునిగణంబుల పవిత్రధవిత్రంబుల హోమధూమంబుల నతి
శ్యామాభిరామంబు లగు దరుస్తోమంబు లంబుదకదంబాబు
లని మనంబులం బ్రేమయూఁగ నాడు మయూరార్భకంబుల
లోఁగొను నశ్మగర్భరశ్మిచ్ఛటాచ్ఛురితంబులగు భూములం
గనుంగొనియుం గవకపత్రస్థానంబులం గానన సీధుకానన
లగు భిల్లపల్లవాధరులు భల్లంబులం బ్రేళ్ళనేసిన తమనిసు
వులం జూచి సంజీవకరణిం దిరుగఁ బ్రదికించి వానితోఁగూడి
సంచరించు కాంచనగరుల్లక్షితంబులగు పక్షులనీక్షించియుఁ,
దత్ప్రాంతంబుల నతిశాంతంబులగు శశికాంతశిలాంతరంబుల
బ్రకేవలం గుంభకప్రభావంబున శిలాంతరబంధులుంబోలె
నిశ్చలత్వంబు నెనసి భస్మితభసితోద్ధూళితాంగులగు మహా
యోగుల బాగులు దర్శించియుం దత్ప్రవర్తనమహాత్త్వంబు
నకు నందంద డెందంబున నానందించుచు.

గీ. వింధ్యభూధరమును బయల్ వెడలి యచట
నఖిల లోకైకశర్మద యైనయట్టి
నర్మదను గ్రుంకి మునిశరణ్యంబు లగుచుఁ
బొదలెడు నరణ్యములుఁ బుణ్యనదులుఁగడచి.

సీ. ప్రతివీథిసంచరత్పార్వతీచరణాంబు
జాతనూపురఝుళంఝుళరవంబు
విశ్వనాథవిహార వృషభ రాజాకుంఠ
కంఠఘంటా ఘణంఘణ నినదము
పటహారవ దభంగ భాగీరథీభంగ
సంఘుఘుమంఘుమ స్వనభరంబు
రక్షాధికార భైరవభుజా స్తంభగం
భీర ఢక్కా-ఢంఢమారవంబు

సరవి నెచ్చోటమోహకంబుజాటు సిరుల
కాపురంబగు నా కాశికాపురంబుఁ
దజేసి మణికర్ణికాదితీర్థముల నాడి,
యభవుసేవించి యచ్చట నలరుచుండ.

క. ఆ కాశీశ్వరు రాత్రి
నైక విలోచనమునందు నెసఁగెడు సెగలే
పై కొనియె ననఁగ లోకం
బాకులపడఁ దోఁచె గ్రీష్మ మతిభీష్మంబై.

క. పటపటఁబగిలెం గుంభిని
తటతటఁబధికులమనంబు తల్లడపడియెన్
చిటచిటనెగసెన్ దవశిఖ
కటకట గ్రీష్మం బొకింత కనఁబడునంతన్.

చ. బడి చనుదెంచుచాయ ధరఁ బాంథులతాపముతీర నక్కడ
క్కడఁ దరుజాలమూలములఁ గ్రమ్ముచునిల్వఁగదాని గ్రుచ్చుకో
వడిఁ గరపాళి యొత్తి దినవల్లభుఁ డల్లన సాఁగె నాఁగ న
య్యెడనతిదీర్ఘభావమువహించెనహంబులహోమహోగతిన్.

గీ. అట్టివేసవి బెడిదంపు వెట్టకతన
నేల నందంద విరిసిన నెఱియలందుఁ
దరణిపాదంబు లెడనెడఁ దవుల మెల్లఁ
దివిచికొనిపోవ దివసంబు దీర్ఘమయ్యె.

చ ఘనతరకీచకోత్కరముఖంబులఁ దద్గతభోగిఫూత్కృతుల్
దవరఁగ నాఁదియోషధికదంబకచూర్ణముఁగూర్చి కొండలం
*గనకము సేసెఁ దత్సమయకైతవ సిద్ధుఁడనంగ నెల్లెడం
గనగన మించె నంతయు నఖండదవాగ్నిశిఖాప్రకాశముల్.

చ. ఖరకిరణోగ్రతాపమునఁ గ్రాఁగి రసాతలభూమి డాఁగి సా
గరములు నింకెనో యనుచుఁ గైకొనిచూడఁగవచ్చిపోవుచుం
దిరుగు సవిద్యుదంబుదతతిం దలపించఁగఁజేసె నయ్యెడన్
ధరణిధరాగ్ర జాగ్ర దురుదావ ముఖోద్ధత కీలిధూమముల్.

---

* ఈధూమవేధిశబ్దవేధులకు:—

ధూమవేధీరసం పిష్ట్వా తేన వస్త్రం ప్రలేపయేత్ తతో జ్యోతిష్మతీ తైలే తస్యావర్తిం ప్రకల్పయేత్ । జ్వలితాం తాం తామ్రపాత్రే యోజయేత్పత్రతాం గతే । తద్ధూమగంధమాత్రేణ సర్వం భవతి కాంచనం । శబ్దవేధీ రసో యోఽసౌ గులికాం తేన కారయేత్ । తత్సర్వం జాయతే స్వర్ణం శ్రుతే శబ్దే వసంశయః । పాషాణవేధకో యోఽసౌ పర్వతానపి వేధయేత్, వేదయేదగ్నితప్తాని సర్వం భవతి కాంచనం. అని వుంథాంతరవుచనః—

ఉ. అబ్బలు వేసవిన్ ఘనగుహాంతరసీమల రేవగళ్లు మైఁ
బ్రబ్బెడు నుబ్బ సుబ్బఱఁగఁ బాటలు దప్పి మొగంబులెండఁగా
బెబ్బులు లొక్కపెట్ట నతిభీకరభాంకృతు లాచరించె నా
గుబ్బగఁ గొండలెండవడఁ గ్రొంకుచుఁ గూఁతలు పెట్టెనో యనన్

క. సుడిగాలి ధూళిఁ జుట్టుచు
వడిగా నందంద తిరిగె వలయంబగుచున్
బుడమియను బరణి లెఱ్ఱ తిరిఁ
గెడుకరణిం జాలె నట్టి గ్రీష్మమునందున్.

గీ. ఊష్మలత మించ నెంతయుఁ గ్రీష్మసాలి
చండమార్తాండకిరణంపుఁ శాటి మీాట
నెండమావులు గదలె నుద్దండ గతుల
మృగకులంబులు గని తృష్ణఁ దగులుకొనఁగ.

క. బడిఁ బఱచు నెండమావుల
నడుమ నవుడ కాలి లోఁ గనంబను నుద్య
ద్బడబాగ్ని కీలముల గతి
గడుమించెన్ ధాతుపుష్పి కానివహంబుల్.

గీ. వడగ సురటుల నప్పటప్పటికిఁ గొంత
ఘూత్కృతుల వేరి గాడ్పులు పొడముచుండ
బ్రదుకుఁ గవెఁ గాక భోగు లప్పగిదిఁ గాక
యుండెనే నట్టి వెట్టచే నుడికిపడవె?

క. ఆతఱి సలిలం బెండును
పాతాళము ద్రవ్వఁగానఁబడకుండు గరిఁ
భీతిల్లు యోగిజనులకు
శీతలకుంభకము గలుగ జీవన మొదవెన్.

సీ. కమ్మవీడెంపు కెంగారంబు గలమోవి
కండచక్కెరపానకంబు లిచ్చి
చలువతావులు గుల్కు కలికిలేఁబల్కుఁ గ
ప్రంపుఁ బల్కులను గర్ణములఁ జొనిపి
జీనిపన్నీరు నించిన యట్టి కుచకుంభ
యుగళంబు నక్కున నొత్తియొత్తి
పాటల సుమసౌరభంబులు వెదజల్లు
సొగసుఁబయ్యెదకొంగు సురటివిసరి
రమణు లెంతయుఁ దమతమ రమణులకును
దాపములుపాపి రొకకొంత తపనుఁడపుడు
తనదుపండ్రెండుమూర్తుల నెలసినట్లు
కొండ లవియంగ గండంపు టెండగాయ.

క. ఇటు లన్వేసవి యెల్లెడఁ
జొటచొట నిప్పుకలు కలుగుచో నక్కాశీ
పుటభేదనంబు వెలువడి
యటుచనుచు మునీంద్రు లవల నవలద్గతులన్.

మ. తమసానిమ్నగ దాఁటి తజ్జల సముద్యద్బాలశైవాల జా
త మసారద్యుతి తీరభూరుహావిభాధట్టంబు తోఁగూడి సం
తమసానీకముఁ బోలె నల్దెసలు నిండంజూచి యోహోమహా
తమసానీరము నిండెఁ జెల్లదని చింతం జాల బల్కెంపుచున్.

సీ. నలువంకలకు డిగ్గి పలువంకలకుఁ జాఱు
కొండవాఁకలు కెలంకులను నిండ
నొండొండఁ దీఁడించు నుంద్రలఁ జంద్రల
బొదిగొన్న పేకీతపొదలఁ దుదలఁ
జదలంటఁ బెరిగినఁ జాలలోయలచాఱు
జాళె యల్లిన లీల సందు వెడల
నాఁగినకో.........
వలయంబుఁగొనలోనఁగలయబలసి
వెదురు ములుబూర్గు ములు రేఁగు వెలగ వేము
గలివెయుఁ జెలంగ దిగ్గజకర్ణములను
జెవుడుకొన ఝల్లికాధ్వని జంద్రమనఁగ
జీమదూఱని యొక వనసీమఁ గాంచి.

ఆ. మాను లచట వారిమార్గంబు గానక
వెదకివెదకి యల్ల విపినభూమి
పాపటయును బోలెఁ జూపట్టు నొకతప్పు
ద్రోవ వెంటనంటి పోవు చవల.

స్రగ్ధర.

కనిరామాహీంద్రచంద్రుల్ ఘనరసవదసృక్స్వారణాచుంచుపంచా
నన కోపాటోప చంచన్నఖరకులిశ భిన్నత్రుటత్కుంభిరాట్కుం
భనివేశోన్ముక్త ముక్తాఫల సరవిసరోద్భాసి ఖిల్లీమతల్లీ
ధనురాస్ఫాలస్ఫురన్నిధ్వనిజనితమృగీఖావనంబున్ వనంబున్.

క. కనుఁగొని యోహోహో! యీ
వనమహిమము లేరికైన వర్ణింపంగా
జనునే, యటంచుఁ బలుకుచుఁ
మునులందఱు నవ్వనాంతమునఁ నంతంతన్.

సీ. తోరణంబులుగ వీథుల నారఁగట్టిన
యుప్పుగండలకు నొండొండ దిసుగు
పులుగుల తెక్కగాక్కులఁ జాల నెగసెడు
పసరంపుఁ బొలకంపు ముసురుకొనఁగ
బసివట్టి నలుగడఁ బఱచిన మెకముల
పచ్చితోళ్ళను బండ్లఁ గ్రుచ్చిపెఱుకు
బలుజాగిలంబుల భౌభౌ రవంబులఁ
గొంకి పంకములోన ఘుర్ఘురించి
పరుపులిడు నూరపందుల ముఱికిగవులు
చేఁప తట్టలఁ గదురుతోఁ జెనసిచుట్టఁ
గూఁతవెట్టిన జనుల వాకొలుపఁజేయు
భయముగొల్పెడు నొకబోయపల్లె గాంచి.

క. చుట్టును బసరపు టెమ్ముల
తెట్టలుచూచినను మదికి దిగులయ్యెడు హా
కట్టేడిదైవం బిచ్చటి
కెట్టు మనలఁ దెచ్చె దాఁటు టెట్లోకొ యనుచున్.

క. చండాలవాటికయు నిటు
లుండునె యీరోఁత గన్న నొక్కటఁ బ్రేవుల్
గుండెలు నిలువక వాంతికి
నొండరిగెడు కర్మఫల మహా యిటు లుండెన్.

క. నటి చెదర కిరాతుల ముం
దటనైనం బోవవచ్చు దయమాలిన యి
క్కటుకుఁగిరాతుల ముందటఁ
వెటవక చనఁ బోల దిచట వెఱ వెయ్యదియో.

గీ. అనుచుఁ గరములు మొగముల కడ్డమిడుచుఁ
గోసినటువలె మనసున రోసిరోసి
వ్రాసి యుమియుచు నుడియు దుర్గంధమునకు
నాసికలుమూసికొనుచు సన్యాసివరులు.

చ. మిడిమిడియెండ కొట్టునను మేనులు పెట్లుచునుండ నేలపై
పడుగుల దమ్ము కుమ్ముపలె నంటుకొనన్ వడిఘుర్మతోయముల్
జడిగొనఁ గా జటల్ గడవసంబులు మోవఁగ లేకపోవ న
య్యెడనొకబోయదాయవలెనెక్కడనుండియొయద్భుతంబుగన్.

క. బడి నేఁగుదెంచి యుఱుమని
పిడుగుంబలె నిప్పు లురులు బెడిదపుఁజూపుల్
గడలచు జడిగొనఁ గడువడిఁ
బొడమెడు తర్జనల నడవిపులుగులు బెగడన్.

చ. కటకటియించు నీలుబలుకాసియు నల్లని మేనుఁ జిమ్మఁజీ
కటి ఘటియింపఁ జేత విలుఁ గైకొని మేఘపుఁబిల్లవోలె న
ట్టిటు శరపంక్తులడ్డముగ నేయుచు డాయుచు వచ్చివచ్చి యా
జ్జటికులసార్వభౌములకు సాఁగఁగ నీ కరికట్టి నిల్చుచున్.

క. నిలునిలువుఁడు మీచేతం
గలసొమ్ముల నెల్ల నిచ్చి కదలుఁడు నాతోఁ
జలపట్టిన మిము నందఱఁ
బలుచట్టులమీఁదనుతికి పారన్వైతున్.

గీ. అనిన నమ్మానులడిఁకిన నటు కిరాతు
బులుకుపులుకునఁ గనుఁగొని పలుకకున్న
బెడుసుఁజూపిన గాని యేయుడుగ గుడుసు,
బాఁపనపిసాచులకు భీతిదోఁపదనుచు

సీ. తోలుదొత్తఁ గుప్పి గోలలు గొన్ని పై నేసి
యవి నెట్టుకడిపోవ నొడు గఱచి
గన్నరాకుములుకుల్ గొన్ని సూటిగఁ బన్ని
యవిపైకిఁ దేల నహంకరించి

యీ రేఁచిలుకుల గోరులంటఁగఁ జెండి
యవియు వస్త్రైనవో నదరిపదరి
పారావతమ్ములు పదియైదు నిగిడించి
యథియును దప్పిపో నాగ్రహించి
యిన్ని నాళ్ళకు నా చేత యేటుదప్పె
నౌర ! యీజడదారుల కంపతప్పు
గలదు గాఁబోలు ననుచును గరకు చుఱుకుఁ
జూపు లదరంగ నటువాని చుట్టువారి.

సీ. జడలచుట్ట కుదిర్చి మెడలపై మోఁచేత
గుప్పుగుప్పున సారె గుమికిగుమికి
కత్తిపాలలుచించి రత్తికేలను ముంచి
జడియంగ మొగములఁ జల్లిచల్లి
సలిలంబు గళగళ తలలమీఁదటఁ బోసి
బుఱ్ఱకాయల నెత్తి పొడిచిపొడిచి
కడవసంబుల రెమ్మ పెడమర్లుగాఁజుట్టి
కూనువోనడివీపుఁ గొట్టికొట్టి
యిట్లుబాధించి శోధించి యెందు నొక్క
పచ్చపై కంబుగాన కప్పచ్చిబోయ
నేఁటి తెరవాటు పసలేక దాటిపోయె
ననుచు వెసవారి పిసమాని యవలికేఁగి.

గీ. వింటికొప్పునఁ జేయూది విన్నఁబోయి
యుసురుసురటంచుఁ గలఁగుచున్నవాని
చంద మీక్షించి యప్పు డాశాంతమతులు
మునులు పలికిరి చేసాఁచి మనికితమున.

గీ. తాపసుల మమ్ముఁ బసులచందమునఁ గొట్టఁ
జేతు లెట్లాడె నిదియేమి చేటునీకుఁ
బాలకుఁడుగాఁగ నెన్నాళ్లు బ్రతికె దీవు
రాతఁ జేసిరె యోరి! కిరాత నిన్ను.

క. ఇటుమునుపు నీవుచేసిన
పటుసాహసములకు నెల్ల ఫలమగు నో యీ!
జటివరుల నిటులఁ గొట్టితి
కటకట! యిఁకనైన దురితగతి మానవుగా.

క. ప్రాయము జలకల్లోల
ప్రాయము కాయంబు నస్థిరం బిందులకై
రోయక దురితమెతవమని
పాయక చేసెదవు నిందపరఁగఁ బుళిందా.

వ. అనిన నాలుబ్ధకుం డతిశుద్ధస్వభావుల సల్లాపయోగంబున
నుల్లంబునం గొంత శాంతి పల్లవింప వారల కిట్లనియె.

గీ. కోలదపసులార యాలిబిడ్డలకుఁగా
గాఁకనావటించ గాన విడిసి

విల్లు నంపకోల లెల్లను [illegible]కొని
యున్న నాకుఁ బాప మొదవు టెట్లు ?

వ. అనిన నత్తాపసాగ్రణు లెట్టిన వీని ననుగ్రహింపవలయు నని
మఱియు నిట్లనిరి.

క. ఓరోరి నీవుచేసిన
గోరపుఁబాపములు నీవుఁగొమరులు నాలుం
జేరఁ బడి పంచుకొందురొ
వారికిఁ బని లేక నీక వచ్చునొ చెపుమా.

క. అన విని వారి ముఖాలో
కనమున జ్ఞానంబు పొడమఁగా శిబముం డో
మునులార ! యిత్తెఱం గా
లిని బిడ్డల గొబ్బునం దెలిసి యేవత్తుఁ.

క. అదె కల్లె దవ్వు లేదిటు
కదలకుఁ డేవచ్చుదనుకఁ గాదని యవలం
గదలిన నాలాగు నెఱుం
గుదు రే కదయుంచుఁ బలికి గొబ్బున జనియెఁ.

మ. చనిమార్గంబున నేణవర్గముల నేఁచం బోక లక్షించి ప
క్షినికాయంబులఁ గొట్టఁగోరక మదిం జింతాభరం బెంతయుం
ఘనమై యెక్కఁగఁ బక్కణంబునకు వేగంబోయి యేచక్కిఁ జ
క్కని తాటింటికి నేఁగి వేకమగు కాఁకఁ వెచ్చగా నూర్చుచుఁ.

క. విలునమ్ములు నటువైచుచు
నలనత నొక జింకతోలునందునఁ గూర్చుం
డిల వ్రాయుచుఁ దనపాపముఁ
దలపోయుచు నెమ్మనమునఁ దల్లడపడుమర్ల. ౨౨

చ. కుమరుగ జంగసాఁచి చనుగుబ్బలు మీటుగఁ బొఱుటాకుఁ బ
య్యెద పాదలంగ నెన్నుదు రొకింత చెమర్పఁగ మేచకాళి నే
ర్పుదొరలఁ బాడిచందనపుగోలున నేమఁగుఁగొమ్మ నొక్కట
బ్రిదిలెకుకొప్పుతో వెన రుచిత్యముగుప్పనిజపిరియాంగన.

క. రావే యనిపిలిచిన నది
వేవేగ వదలు కొప్పు విప్పును జన్నుం
గ్రేవల వలఁగొను కెంపుం
దావడముల యొప్పుఁ జొప్పదవఁ జనుదెంచెన్.

వ. ఇట్లుచనుదెంచిన యయ్యంగనం గమంగొని యక్కిరాతుండు

క. ఓపడఁతి ! తానొనర్చిన
పాపంబులు దలఁప నీకుఁ బనిగలదో నా
కేపనియొ కాక చెజిసిగ
మైపరఁగునొ నాకుఁ దాఁచ కింతయుఁ జెపుమా.

క. అనవిని యచ్చెలి నగుచు
న్నను నాయక! తలఁపు నాకు నీదగు పాపం
బునకుఁ బనిలేమ నీప్రా
పున నెంతయుఁ గుడిచి కట్టి పొసఁగుట కన్నన్.

చ. తపుల వారికెవ్వరికతంబున నీవెర వప్పుదీసి తె
త్తువో కొని తెత్తువో తెరువుదోఁచుచుఁ దెత్తువో జూదమాడి తె
త్తువో చని తెత్తువో యదియు దోసమొ పుణ్యమొ నాకు నేటికో
తవతవ నీవు దెచ్చినవి డాఁచక వండఁగఁ జూడి నిచ్చలున్.

క. అనవిని మనస్సు చివుకురు
మనఁ గొడుకులఁ బిలిచి యట్ల యడిగిన వారుం
జనని పలికినటు పల్కిన
విని యచ్చెరు వంది చాల వెడ వెడ నగుచున్.

గీ. మోసపోయితి నిన్నాళ్ళు నాసఁడగిలి
యాలుబిడ్డలుఁ దానఁ జుట్టా లనంగ
నెవ్వ రెవ్వారలే యూరి కేద్రితోవ
వీరి కేఁబాటువడు టెల్ల వృథయయనుచు.

క. దోసమునకుఁ బని లేదట
వాసామ్ములు వీరికిం దినంబని గలదే ?
రోసితి సంసారముఁ దెగఁ
గోసితి మొదలంట బంధుగుల తగులెల్లన్.

వ. అనితలంచి యన్నిపాదఁండు సన్న్యస్తసమస్తసంసారుండ
గుచు నానాసుకృతవాసనావిలసితంబగు ననూనజ్ఞానామృతా
పాదనంబున మోదంబు నొందుచుఁ బుత్రమిత్రకళత్రాది
సంగమంబు తొలంగి, క్రిమ్మఱ నమ్మునులపాలికిం జని యం
దంద వందనంబులు గావించి యంజలిపుటఘటితనిటలతటుం

డగుచుఁ దచ్చరణరేణుసంస్పర్శనంబునం బాటిల్లు వాక్పాట
వంబున నో మునీంద్రులారా ! సకలకలికర్శనంబగు మీసం
దర్శనంబునం గృతార్థుండనైతి; నాజననంబు సఫలంబయ్యె;
నాజవంజవభంజన స్వతంత్రంబగు నొక్కమంత్రంబు నాకు
పదేశింపుఁడనుచు సంతసంబునం బునఃపునఃప్రణామంబులా
చరించిన, నవ్వాచంయములు న్వనేచరుని సమీచీనధీచాతు
ర్యంబునకు నాశ్చర్యంబు నొందుచు మున్ను వీఁడన్నితరం
బులు సలిపెనో యాంచితుండయ్యె సత్కర్మంబు వాటింపం
దలంచె నంతటి ధన్యుఁడని సంతసించి, సర్వవర్ణసాధారణం
బును నిఖిలమంత్రఫలదంబును లోకాపారదోషరహితంబును
దేశకాలనియమానపేతంబును సత్యకామంబును శ్రుత్యభి
రామంబును మనసార్వభౌమంబును నగు రామనామంబు
కాని వేఱం బవిత్రం జేయు వేఱొక యుపాయంబు లేదనియు
నేతాదృశులకుఁ బ్రతిలోమంబుగా నుపదేశింపవలయు నని
విచారించి యావంశ నొక్కతీర్థకుండంబున నక్కిరాతు
సుస్నాతుఁ గావించి సంభావించి.

కం. కిరాత రాఁ దలంపు హత్తి కేవలంబు భక్తిమై
మరామరా యటంచుఁ బల్కు మా యనుగ్రహంబునన్
బరాకు రాదటంచు రామమంత్ర మిచ్చి యంతటన్
ధరాధరాధిభూవిభూతి దర్శనాభిలాషులై.

క. చని రవ్వాల నమ్మునులఁను
వనచరుఁడును వారి బుద్ధివదలక మదిలోఁ
ననుదినము కందమూలా
శన మొనరించుచును నితరసంగరహితుఁడై.

సీ. నుదుటజేగురుబొట్టు పదనిరకఁ గాదని
తులసిమృత్తిక నూర్ధ్వతిలకమిడియె
సెలసువిల్లువహించు కెలసంబుగాదని
వేణుకుండిక యొంటుపాణిఁబూనె
సొగసునున్న నికోర సిగసూటిగాదని
నిడుఁదపెన్నరులెల్ల జడలుదాల్చె
*నిండుగాటపునీలి దిండుగాదని కటిఁ
బలుచనినారచీరలుధరించె
దినము తమసాతరంగిణీ తీర్థమునను
స్నానమొనరించి యత్యంత శాంతిమెఱయ
మాను లుపదేశమిచ్చిన మంత్రమెపుడుఁ
దపముసేయుచు నక్కిరాతప్రభుండు.

క. ఈసరణి వాఁడు సకల
వ్యాసంగము మాని మానివర్తన నుండఁగా
వేసటచే నీఁ డెక్కడఁ
గాసింబడె ననుచు వానికలవారెల్లన్.

---

* నీలిదిండు "పాఱుడలనీలిదిండొలికి బూడిదయుండులబంతి" దశ ౫-౫ (శాకవత్రిక.)

క. చెట్టుల పుట్టుల గట్టుల
చుట్టుల నందంద వెదకి సొలయుచు నొకచో
నట్టడవిలోనఁ గదలక
చట్టుంబలె నున్నవాని చందముఁగనుచున్.

క. నట్టడవిఁ జట్టుకొడుకై
కట్టెదుటన్ మనము నిలువఁ గా జూడఁడు తా
నిట్టిటు బాఁపనదయ్యము
వట్టినొ యీరావినుండి బాపురె! వీనిన్

క. ఇయ్యఁడవి వీని సేబలు
దయ్యంబులు వేసెనొక్కొ? తరలకయుండన్
డయ్యఁ డొకింతయు మనతోఁ
గుయ్యనఁడొల్లండు కన్నుఁగొన తెఱవంగన్.

సీ. నెమ్మినెంచెపుడండ గ్రిమ్మి చుట్టుకొవ్వు
జడలుదాల్చుట కిట్లు గడలుకొనెనె?
పచ్చికస్తురిబొట్టు పసమీఱు నెన్నొసల్
సుద్దరేకలచుక్క దిద్దఁబడెనె?
తడవిల్లొకప్పుడు విడువని చేయుల
మోముచూపెడునట్టి ముట్టెనెనె?
యడవిలోఁగడువడి యుడుఁగని యడుగులు
గదలక యీచాయఁ గుదురుకొనెనె?

యకట చెడి వీని నెవ్వఁడో యొంకకాఁడు
తప్పనున్నల బుద్ధులు తగులుకొలిపి
బోయజాతికి వెలిగాఁగఁ బాయఁజేసి
నాలుబిడ్డలు మనుమలు నలియఁజేసె.

వ. అనివానిం జేరుకొని యందఱు మఱియు నిట్లనిరి.

ఉ. దాయలుగూడి యెవ్వరు వితా నినుమాతలఁగాకయుండ ని
మ్మాయలు పన్ని రింతచలమా తలమానిసి వింటవింట నీ
వేయఁగ నేరవో మలల నేయొకలం దిరుగాక నేరవో
బోయతనంబు వీటిఁడిన పోయెఁగదా మగవాసి వమ్ముగన్.

క. సాము దిగవిడిచి యొడలిటు
సాముగ నట్టడవి నిసుర సవిమాని యరయో
జాము దిగఁగాళ్ళు నెసిమిది
జాములు నిటులుండ మనకు జాతికిఁ దగునే.

సీ. కన్నులుదెఱవని గండభేరుండంపు
నిసువుల నెవ్వరునే త్తరగరయ
నేనుంగుతల పాలసెవ్వరు దెత్తురు
పెంచినసింగంపు పిల్లలకును
కవిసినదొడ్డిలోఁ గాఱెనుపెంటుల
దట్టించి యెవ్వారు గట్టఁగలరు
పులులకూనలకు రేపును మాపుఁ దగునట్టి
మేపులెవ్వరు దెచ్చి మేపువారు

ఇంటనీవటు లేకున్న నిట్టిపనులు
కుఱుచబుద్ధులచేనౌన? కొలమువారు
చాలనగ్గింప నామముచాతినుమట
నుదుటుతనమెల్లమాని యిట్లుండఁదగునె

ఉ. కానకు నేఁగి వింతరుచిగల్గిన పిట్టలుఁ జెట్టు జున్నులున్
దేనెలు చారపప్పులును దెచ్చుఁగదా యిఁకనంచు గూళ్లలో
గూనలు వోసి నీకొఱకుఁ గుఱ్ఱలు నీచనుదెంచు త్రోవఁ జూ
పానఁగ నిల్తురయ్యెడలు హా! మముఁబోంట్లకుఁజూడవచ్చునే.

క. గువ్వకలకుట్లు మెకముల
క్రొవ్వుల బొరుగులును గుమకుగుములేయుటయు
న్నివ్వరికూడును నింటం
బువ్వంబునఁ గూడి కిల్లు పొక్కందగునే.

ఉ. బోటుమిటారికుబ్బెతలు పున్నమవెన్నెల బైట నీపయిం
జాయనిబాతి కిన్నరలు మాటికి మీటుచు నీప్రతాపమున్
హాయని చొక్కపాడ వినవా కనవా మనవారిఁబాసి నీ
వీమొన నొంటినుండఁ దగవే తగవే చనుదెమ్ము వీటికిన్.

సీ. కులుకుగుబ్బలతోన కురువిందపేరులు
గునియుచుఁ బెనఁగొని గొడ్లిఁజూప
దంతంపుఁగమ్మల తళుకులుపలచని
చెక్కుటద్దంబులఁ జికిలిసేయఁ

బగడలరతనాలు బవిరులు పికిలి పూ
దండకొండొండః గై దండయొసఁగఁ
గదలుఁగొప్పునఁజుట్టుఁ జెదరిపారెడు మల్లె
మొగ్గలు తెలినిగ్గు ప్రముగ్గులిడఁగ
నడవిదడవిల్లుఁ గైకొనియమ్ముఁ దొడిగి
పొంచి మైవంచి నినురెచ్చరించి మంచి
మెకముఁబడనేసి నిచ్చలు మెచ్చఁజేయు
నట్టి నాయకురాలిఁ బాయంగఁదగునె.

సీ. దుప్పులఁబడనేసి యుప్పుఁగండలుచేసి
చప్పరింపుచునుండుఁ జవులుమఱచి
మదహస్తినదలించి యదిహత్తిరాఁబొంచి
యెదనాటుకొననేయు నేటుఁదుడిచి
పచ్చికస్తురిమేన హెచ్చివాసనలీన
రంగులేయుచునుండు రహిదొలంచి
మింటిప్రమాకులనంటియుంటి ప్రమాకులు ప్రాకి
జంటితేనెలుగ్రోలు సొంపుమాని

నారచీరలుగట్టి యన్నంబుదట్టి
గాలిమెసవుచు నాతిపై బాళిలేక
జపము ప్రేల్చును నన్నుచు జాతివిడిచి
బాపలనుగూడియుండుట బాతియగునె ?

గీ. తెల్లవారిన గుండగ్గి కోళ్ల లీల
నీళ్ళు మునుఁగుచు నోడలెల్లఁ దెల్లఁబాఱి
నిట్టుపాసంబులనుగూడి నెవ్వఁదొడరు
వెడగు బాపన తగులునఁబడితివేల ?

క. పతిచెడ్డ బీదబాపని
గతి నిట్లుండంగఁదగునె ? కటకట మది ! నీ
వెతనెంచవు మనకులమగు
మతమెంచ వొకింతరాతమలిచిరో ? నిన్నున్.

వ. అని యుద్విగ్నంబున నా వ్యాధులెల్ల మహావ్యాధులుంబోలె బాధింపఁ జయ్యన సాధారణాగాధ బోధైకనిధానుండగు శబరనాథుండును.

క. కనుఁదెఱచి నవ్వి యేమియుఁ
బనిలేదని ముందుమీఱు పలికితి రిపుడే
పని కిటువచ్చితి రిందఱుఁ
జనుఁడెఱుఁగుదు మీదుమాయ జరగునె ? యింకన్.

గీ. తండ్రి రాముఁడు జనకజ తల్లియెల్ల
బంధులును నాకు నాస్వామిభక్తులెన్న
నింతవాఁడను నాకెందు నెదురుగలదె ?
సకలజగములు నేలుదు సుకరముగను.

క. మీ రెవ్వరు ? మే మెవ్వరు ?
నేరము లెంచక చనంగ నిలువక యెటకే
శ్రీరఘుపతియే నాకు న
కారణ బంధుండు గురుఁడు గణుతింపంగన్.

క. కటకట ! జననంబులు వే
రఁట గుణకర్మాదికంబు లఖిలంబులు వే
రఁట చనియెడుత్రోవలు వే
రఁట యిది యటమటిపుఁగూట మనికనవలదా.

క. సతు లెవ్వరు సుతు లెవ్వరు
హితు లెవ్వా రేటివఅద నందేనొక చో
జతగూడిన కాష్ఠంబుల
గతి నించుక గూడివిచ్చి కదలుదు రవలన్.

క. అనియాశ విరుగనాడిన
విని యందఱుఁ జనిరి ఱాతవేసినగతి న
వ్వనచరుఁడు నంత నంత
ర్ఘనతరబోధావధాన రంజితుడగుచున్.

సీ. సరసిజాకరముల సరసిపద్మాక్షముల్
పరిపక్వముగ నేరుపటిచి తెచ్చి
పురుషసౌభాగ్యములైన పూసలువరికించి
ముఖములుముఖముల మొనయఁజేసి

పరభాగములతో నపర భాగములనుంచి
నడుమ మేరువుగ రెండిడి యమర్చి
యంతరంబున గ్రంధు లమరసూత్రంబున
నూటయెన్మిదియుఁ బొందువడఁ గ్రుచ్చి
యట్టియక్షసరంబుఁ జేబట్టి తనకు
మాతులిచ్చిన యదిగాక మానసమున
దలఁచి యంగుష్ఠికాద్యంగుళులనుఁ మేరు
పదముదాఁటక త్రిప్పి జపంబుఁ జేసె.

సీ. దినము మరామరా యని పల్కునంతంత
యది రామనామ పర్యాయమయ్యె
నారామనామ జపానుభావంబున
నంతర్ముఖతఁ జూడ నల్లనల్ల
నల్లని మొగులొందు నానాఁటఁ గనుపించె
నదియుఁ గోదండకాండాంకితమగు
సగుణభావముఁ జెందె సగుణరూపంబెల్ల
రూపింపనిర్గుణ రూపమగుచుఁ
గోటిరవిచంద్ర తేజమై కొమరుమిగిలి
నట్టి తేజంబునందును నంతరంగ
మిట్టటుచలింప నీయక గట్టిగాఁగఁ
బూదెగఱగినగతి నేకముగ ఘటించె.

క. అత్తేజంబున నెంతయుఁ
జిత్తమలయ నంతఁ గాయసిద్ధి మెఱయఁగా
హృత్తామరసమె సూచుచు
నుత్తమయోగుల నతిం వనుండె నచలుండై.

వ. అనిచెప్పిన విని యమ్మునిపుంగవులనంతరకథావృత్తాంతం బడుగుటయును.

శా. ఉద్దండానలచండకోపన సుబాహూచ్చండదోర్దండభూ
భృద్ధంభోళిశిలీముఖక్షపిత మారీచజ్వలద్ధామ వి
ద్యుద్దామస్ఫురదాశుగా కులిశ పాథోరాశి గర్వోన్నయా
యుద్దామద్యుమణిద్యుతిప్రతినిధి ప్రోద్యత్ప్రతాపోదయా.

క. సుగ్రీవ భరణగుణ సా
మగ్రీ హారీదంతతాంత మానితకీర్తీ !
విగ్రీకృతశూర్పణఖా
వ్యగ్రీభవ సమరవైరి హరణవిహరణా !

మాలిని.

చిరమునీశ హృదయదేశ చిత్ప్రకాశరూప వి
స్ఫురణగణ్య జనశరణ్య భువనపుణ్యశోభనా
కరవిహార యమృతహార కలితసారకీర్తి సం
భరణలోల దిగధిపాల భణితశీల ఖేలనా !

—గద్య.—

ఇది శ్రీరామచంద్రసాంద్ర కరుణాకటాక్షలబ్ధ సిద్ధసార స్వతవిశేష, నిరర్గళ వాగ్వైభవాశేష సరససాహిత్యకళాభోజ, సత్యసంభాషిత ముఖాంభోజ, సకలసామ్రాజ్యధౌరేయ, నిత్య వితీర్ణిధారారాధేయ, నిరతావారితాన్నసత్ర సంతోషితప్రతిదివస పంచాశత్సహస్రభూసుర, బహువారావర్తిత మహాదానవైభవా వర్తిత కీర్తిభాసుర, నిజనామాంకితాకలంకవస్తుసమగ్ర బహుళా, గ్రహారభూషిత,చోళధారామండల నిఖిలభోగవిభవనిర్జితాఖండ, ల సాధీతసముద్రాంతరద్వీప పరనృపాలసంస్తుత్యప్రతాప, నేపాళ భూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయధౌరంధర్య, రామ సేతు శ్రీరంగవిజయరాఘవపుర కుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపి త రామభద్రసర్వజనసంభావిత, గాంభీర్యముద్రావినిర్జిత సముద్ర సదాశ్రితభరణ దీక్షాదక్ష దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజ సన్నుతా సాధారణశౌర్య దిగంతప్రసిద్ధతరౌదార్య సుజ్ఞానజనక సతతసంసేవితజనక పోషితవిద్వత్కవియూధ, భువనశోభితగుణస నాధ, బలవత్పరిపంథిగృహీత సామంతమహీకాంత విమోచనశ్లా ఘనీయబాహాబల, మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల, చినచెవ్వ నృపాలపుత్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజితకుసుమసాయక

సకలధర్మసంధాయక, రఘునాథనాయకప్రణీతంబైన వాల్మీకిచరిత్రంబను మహాప్రబంధంబునందు

ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# వాల్మీకి చరిత్రము.

## తృతీయాశ్వాసము.



జనక నందనావన
శోభిజ్రవిలిప్తమసృణఘుసృణశోద
భ్రాజిత బాహాభ్యంతర
రాజ నయకలాకలాప రఘుకులదీపా !

వ. అవధరింపు మప్పూర్వతుం డమ్మునుల కిట్లనియె. నవ్విధంబున నాశబరనాథుండు.

క. బాలునిలీల న్మత్తుని
పోలిక నితరంబు బుద్ధిఁ బొడమక యతఁడు
ద్వేలాత్మానందస్థిర
శీలుండై ఘోరతపము సేయుచు నుండెన్.

క. అతని శిరంబున నీవృతి
హాతపటురవవహ్నిజాల మద్భుతధూమ
ప్రతతులతో నుత్థితమై
యతిక్రూరోపప్లవంబు నడరం జేసెన్.

చ. ఉగమున నంబయుంచుఁ జరు లుల్లసఁ లంగడుఁదల్లడంబులం
బొగులఁగఁగొన్ని దిక్కులఁ గపోతకపోతసమూహధూమ్రమై
పొగయుచుఁగొన్ని దిక్కులఁబ్రభూతశిఖావయమంటమింటిపై
నెగయుచు నన్నిలోకములు నేర్చెఁ దదీయతపోగ్ని మిక్కిలిన్.

క. గుజగుజలాడుచు వెడలిరి
గజగజ వడఁకుచు మౌని గంధర్వాదుల్
నిజవసతులం దద్ధూమ
ధ్వజకీలవ్రజము లన్ని వంకలఁబర్వన్.

క. ఇక్కరణిఁ దత్తపోరణిఁ
బిక్కటిలిన వహ్ని లోకభీకరమగుచున్
గ్రక్కున దివికెక్కిన మదిఁ
బొక్కి పురందరుఁడు బ్రహ్మపుత్త్రునితోడన్.

ఉ. చిత్రజవైరి ఫాలశిఖచే జగమెల్లను వెచ్చఁ జూచెనో?
యిత్తెఱఁగంటి పట్టమున కేనిటు లుండక యుండనవ్వఁడే
నెత్తులు వెట్టెనో మఱియు నేకతమో వివరింపు మయ్య నా!
కిత్తెఱఁ గంతయుం గృతిరమేశ్వరనందన! బ్రహ్మనందనా.

చ. అన విని నారదుండు మది నారసి యిట్లనె నోసురేంద్ర! భూ
మిని దమసానదీతటిసమిద్ధవిశుద్ధగుణప్రసిద్ధుఁడౌ
వనచరుఁ డొక్కరుండు రఘువల్లభుఁగూర్చితపంబుసేయుచుం
డ నతని వేఁడి మిట్లు భువనంబులఁబొక్కఁగఁజేసెనంతయున్.

వ. అక్కూరాతపరుం డనాకలసీతారమణస్మరణప్రభావంబునం
జెందిఁ యనిందితాచారుం డగుచుఁ నరవిందభవాదిపదంబు
లతితుచ్ఛంబులుగా నెఱింగి యితరేచ్ఛఁ దొఱంగి స్వచ్ఛత
రస్వచ్ఛంద పరమానందభూయంబును, సకలచ్ఛందోభిధే
యంబును, మునిభాగధేయంబును, భక్తజనవిధేయంబును,
రామనామధేయంబును, నగు నొక్కరూపధేయంబు నిరం
తరధ్యేయంబనితలంపుచున్న వాఁడతనివలన నీకు భయంబు
లేదు పురందరా! అని పిలిచి డెందంబునఁ జేయిడి సుఖం
బుననుండు మఱిన నొక్కింత ప్రసన్నముఖుం డగుచు శత
మఖుం డమ్మునిశేఖరుం గనుంగొని.

సీ. నముచిజంభవిజృంభణము చించి మించిన
కతలుఁ వ్రాసిన భిత్తికలు సెలంగ
సంతానమంజరీసంతానములు గూర్చి
కనుఁబట్టు పట్టు మేల్కట్టులమర
గంధర్వభామినీగాంధర్వసంగతి
ఘుమ్మను పసిఁడిటంకులు వొసంగ
కడలలోకములు నిల్కడలు గన్గొన, వచ్చు
రమణీయమణిజాలకములు దనర
నిర్మలప్రభ మీఱు సుధర్మయందుఁ
జుట్టు నుచితాసనంబుల సురలు మునులుఁ
గ్రమ్మకొని కొల్వఘనవైభవమ్ము మెఱయ
నిందుకొలువున నుండియాఖండలుండు.

ఉ. కిన్నరకంఠుఁ డౌ నొక యగారములో రతనాలమేడయో
రన్నువగెంపుటంచు నెలతాలమెఱుంగుటరుంగుమీఁదఁ దా
నన్నలకూబరుండును మనోహరలీలల నత్తఱిఁ జూచి తే
పన్నిదపుం జెఁబంతములువల్కుచునుండె సురంభఁ జూచుచున్.

గీ. నిండుకొలువుండి యమరవిభుండు నన్నుఁ
బిలిచి తెమ్మన రమ్మని పలుక రంభ
రమణుకై దండగొని యొయారంబుమీఱ
జగతి వ్రేల్మిడిగ్గ సేసి సఖులు గొలువ.

సీ. సురుచిరత్రియపుతీవ పనికట్టు కనపట్టు
పట్టుచన్కట్టు సంభ్రమముఁ జూప
నింపు చందురుకావి నెరికచే రంగారు
కడవన్నె బంగారు కాసె యొసఁగ
వలిచుట్టి పూదండ నెలిచుట్టు గననొప్పు
కప్పు చిప్పిలు సామకొప్పు దనర
ఝళ ఝళంఝళనాద హాళ హాళితంబైన
బిరుదు వజ్రపు జల్లిపెండెమమర
మాటికిని మ్రోల జయడిండిమంబు మొరయ
రయము భయమును నయమును బ్రియము నమర
నమరవల్లభు కొలువున కరుగుదెంచె
రంభ సమ్మత నాట్యసంరంభయగుచు.

వ. ఇట్లరుగుదెంచి.

క. అమరీ జనకర చాలిత
చమరీ వాలా నిలాభి చంచల దలక
భ్రమరీ సంయుతుఁడై వి
భ్రమ రీతిచెలంగ హరి విరాజిలుచుండన్.

క. కనుఁగొని సమ్ముఖమునకుం
జన కటులే తెంచి వచ్చి సవినయ గతులన్
మును లోచన రుచి వీచిక
ల నీలములు వడసి చుట్టులన్ వైచి తగన్.

క. కర కంకణ నిక్వణములు
బెరయఁగఁ దగ మ్రొక్కి లేచి పిఱిఁదికిఁజని ని
ర్జరవల్లభు ముందఱఁ జం
దురుకావి చెఱంగుకప్పుతో నటునిల్చెన్.

క. నిలిచినఁ గనుఁగొని సురపతి
పలికెం గమలాస్యలాస్య పరిచితి నీకుం
దులలే రెచ్చట నచ్చర
చెలువలలో నిది జగత్ప్రసిద్ధము సుదిమ్మా.

క. అటుఁగన ఘనకార్యమ్మొ
క్కటి గలిగిన దిపుడు నీవు గడగి మనోభూ
పటుశరలక్షణమగు నీ
కటాక్షవీక్షణముచేత గాఁజేయఁదగున్.

చ. అన విని రంభ జంభరిపునాననముం గని స్వామి ! నన్నుఁజే
సిన బహుమాన మేమనుచుఁ జెప్పఁగ నవ్వి సమస్త దిక్పతుల్
విని మది మెచ్చిరయ్య పదివేలువిధంబుల నట్టి నన్ను నీ
సొనరఁగ దిట్టినట్టి యలయూర్వశి గర్వము నొంచికంపఁజుమ్.

క. మొన్నటి యుత్సాహము నే
డున్నం దున్ని నీప్రతాపమూఁతగఁ గొనియే
న్నన్నంగఁ గార్యములు కను
సన్నను ఘటియింపలేన ? జగములు మెచ్చన్.

గీ. అన్న మీరు నాకు మన్నించియిచ్చిన,
బిరుదుఁ బూసియమరులరుదుపడఁగఁ
గేళిలోనఁ జొచ్చియేరాఁగ నూర్వశి
యుర్వశిథిలభావగర్వయగుచు.

క. బిరుదెవ్వాఁచ్చిరే యా
దొరకు న్నీకు నిఁక గీర్తిదొరకుంగద ! నా
సరిపాత్రివె నీ కెక్కడి
బిరుదని యెన్నుకొని నన్నుఁ బేర్కొని తిట్టెన్

గీ. కొలువులో బిరుదుకాసెను నిలిచి లాస్య
కళలఁగలమేలుచూపంగవలయుఁగాక
వాకలదటంచు నన్నే నివదరుచుండ
[illegible]ఁజేయకయుంట యుపేక్షగాదె ?

చ. భయమటియాడ వెండియు సభన్నినుభంగమొనర్తు నీవయిక
దయగల యట్టి యర్థపతి నందనుఁడుం దలవంచ నంచులోఁ
బ్రియపడి యిండ్లనున్న దొరబిడ్డల నాడుదు రేని సురేంద్ర! యా
వయిమటి యేమివచ్చునో యపాయము నేరఁగ రాదు పిమ్మటన్.

గీ. కలవి లేనివి దొరసమ్ముఖమునఁ గలద
టంచు బలుకంగ వచ్చునె? యమరనాథ!
హరిణియనియెడు తామరసాక్షి సాక్షి
నిలిచియున్నది యదియెల్లఁ దెలిసికొనుచు.

క. లాలించి స్వామిబిరుదులు
పాలించితి రనుచు నపుడె వదరక యుంటిన్
వాళించి విడుతుగర్వము
చాలించి సనంగదాని సరివారు నగన్.

క. అని యిట్లు రంభ యూర్వశి
దనునాడిన పలుకులెల్లఁ దప్పక యుండన్
మనుకొని చెప్పినదంతయు
విని వెడవెడనవ్వి యమరవిభుఁ డవ్వేళన్.

క. ఔరా! యూర్వశి గర్వము
బీరము రంభకును మెచ్చి బిరుదిచ్చుటయే
నేరమె విద్యలు దెలియన్
నేరమె తనయాటనేర్పు నేఁడేర్పరుతున్.

వ. అని పలికి యూర్వశినిచటికిఁ దోడ్కొని రమ్మని వేత్రహస్తు
లంబనుప వారునుం జని యొక్కహాటకనీలసౌధవీథికాంతరాళం-
బున శ్రమకూటంబున నచ్చరచెలులల కూటంబునకు నొజ్జయై
నటనపాటవంబులుగరపు నత్తెఱవం గనుంగొని నేఁడు
నిండోలగంబై యాఖండలుండు నృత్తప్రసంగంబుసేయుచు
నిన్ను బిలువనంపెనని న మ్మత్తకాశినియు నాననంబు ప్రకా
శించ నేఁడు రంభాగర్వభంగంబును నేఁడు మదీయనాట్య
విజృంభణంబును నేర్పడుఁగదా యనుచును గైసేసి యుల్లం
బున.

సీ. వలరాజు మదదంతి తలమాళిగయనంగఁ
గలికిచన్నులఁ బట్టుకంచెలలర
రతిచేటికీనిసురఁటి యానిదియనంగఁ
గలుకుబంగరు వ్రాఁత కాసెమెఱయ
శృంగారఫణిఫణా భంగిఁదా యొతుచుట్లఁ
గప్పుమీఱెడుసాము కొప్పుదనర
నంఘ్రిపద్మముచుట్టు నతివలయంబుగా
నీలాలసరపణుల్ నీటుసూపఁ
బసిఁడితీఁగెకునార్చిన పటికవోలెఁ
జిటులుగంధంబు నెమ్మేన జిగిదొలంక
నృత్తవేషంబు మిక్కిలి చిత్తరింప
వచ్చెనూర్వశి నకియ లిర్వంకఁగొలువ.

ఉ. వచ్చి జొహారుసేసి నిలుచన్ సురనాథుఁడు చూచి రంభతో
మచ్చరమేటికిన్ ? బిరుదుమాటలకుం బనియేమి ? నీకు నీ
పెచ్చులువల్కనేల నినుఁబెంచినతండ్రికిఁ గీర్తిమిక్కిలిం
దెచ్చితి విద్యగల్గుటకుఁ దిట్టుటయే ఫల మింతచాలదే.

క. అని యిటునింద్రుఁడుఁ బలికిన
విని యూర్వశి కేలు మొగిచి వినయంబున నో
ఘనవాహన; యెుకరాడం
జనదైనను విన్నవింతు సర్వజ్ఞనిధీ.

క. ఇన్నాళ్ళు నన్ను మిక్కిలి
మన్ననఁగావించి చాల మంచిన నీవే
కన్నడుగుసేసితేమని
విన్నపమొనరింతు నీకు విబుధాధిపతీ !

క. నాకాధిప; యిటురంభన్
నాకుం బ్రతిసేయుటకు మనంబలరెఁ దగున్
లోకమునరెంపుగల్గినఁ
గా కరయఁగ నొకటిమేలు గాఁందగునే.

ఉ. ఏలినవారు మెచ్చి బిరుదిచ్చినవార్తలు విన్నదాననై
తాళితిఁగాక తాబిరుదుఁదాల్చితిఁనంచు వహించనొక్క నా
వేళ నెయుండఱుంగనఁగ నే బిరుదుల్ తెగఁగోసి దానిచే
వ్రాలఁగనీడిపించికొని వత్తుఁజుమీ యిటకున్ సురోత్తమా;

సీ. శివుఁడొక్కనాఁడు దేశికమెచ్చినాకిచ్చెఁ
బెద్దవజ్రపుఁగుచ్చు బిరుదురవిక
నాతండ్రిహరి యభినయము మేలనియిచ్చె
హారినీలముల కడియాలజోడు
చతురాననుఁడు సరస్వతియు గానముమెచ్చి
యొసఁగిరంచలయందుఁ బసిఁడికాసె
విత్తాధిపతితాళవిజ్ఞానమరసి ప్రే
మఁజెలంగి యుభయచామరములిచ్చె
నన్ని యేనియుఁ గలవని యెన్నిచూడఁ
బెట్టెఁ బెట్టెఁడుబిరుదులు గట్టిపెట్టి
యున్నయవి వానినేఁజూడ నొక్కనాఁడు
బిరుదు లేటికి విద్యయే బిరుదుగాదొ.

గీ. నాట్యసంగీతకళల నెన్నంగనన్ను
రంభవోలుట యెంతదూరంబుదలఁప
దేవకులనాథ! నాయెద్దదిగ్గువడిన
పొలఁతియెన్నటికిని నన్నుఁ బోలగలదె.

గీ. తారతమ్య మెఱుంగని వారివద్ద
నుండుకంటెను నడవులఁ గొండలందు
నాకునలములు దిని యల్ల హరునినైన
మురహరుని నైనఁ గొల్చుట ముఖ్యవృత్తి.

క. వాసవ! నాట్యంబున
వాసియెఱింగియును నన్ను వంచనచేతన్
గాసింబడఁజేసిన నది
నీసర్వజ్ఞతకె కొఱఁత నిలుచుంజుమ్మీ.

క. ఇదెదట్టిగట్టుకొని మీ
యెదుట న్నిలిచితిమి నేఁడ యిద్దఱమును గొం
తఁదడవు మానాట్యంబులు
పదరకవీక్షించి వాసి పరికింపుఁ డొగిన్.

వ. అనియివ్విధంబున నూర్వశి సుపర్వసింహాసనాధ్యక్షు సమక్షంబున నధిక్షేపంబులువలికి, యంతనిలువక యంతంతకుం బ్రిబలు నలుక నొకింతయు నళుకక పట్టునలంబునందిట్టుచుం జట్టుకుబుసంబు పక్కున వ్రీలనవేల ధారాళస్వేదకణజాలంబునం దరంగితంబగుచుఁ గురంగమదరంగతిలకంబుఁ గరఁగింప హృదయకుహారంబు వెడలి యాడుకోపభుజంగంబు తెఱంగునఁ గీలుజడ యిట్టట్టుచలింప నిలింపవల్లభుంజూడకయుఁ జూడఁగనద్రిన్న రుచిరింభోళికలు వియత్తలంబునం దెరలెత్తఁ దత్తరంబునఁ దలయూఁపుచు సువర్ణకర్ణతాటంక సంకలితారుణమణిప్రభాడంబరంబులు ప్రతిబింబించిన చందంబునం జెందిరంబుఁజిలికినపోలికఁ గపోలఫలకంబులు జేవురింపఁ గెంపుగదురు లోచనంబులం జురచురంజూచుచుఁ గుచచూచుకంబులకంపంబుఁ గొట్టువడినహారమౌక్తికదట్టంబులు

చుట్టును మిట్టిపడ దీనిఁ గొట్టించకయుంటినేని హరిపట్టినే
యని దట్టించి కరంబునసురంబుఁ దట్టితట్టి చెఱంగురంగునీ
లంపుఁ గుచ్చులు విచ్చలవిడిం జెదరి శరవంబదరి వదరింఖన్మ
ణిపుంఖితసింహముఖబిరుదనూపురంబులు బిట్టు మొరయ
రయంబడర నడుగులుదాఁటింపుచు విద్యావిశేషంబు బాటిం
పుచు నెడనెడంజగడంపుబడదారి దనదాటింజూపువరపి యొ
క్కింతపక్కి తెగయంజొక్కనగుచుఁ గుక్కిళ్ళుమ్రింగుచు
మెడనిక్కించి కుంచెసారించునెపంబున నెచ్చరింప మిగుల
మచ్చరింపుచు సంరంభంబున రంభంగదిసి యిట్లనియె.

చ. హరిహయుఁడిచ్చినం బిరుదులంకుటపాడియె నీకురంభసా
సరిగనదేశి శుద్ధబహుచారుల నాడఁగలావెయుంచు వే
సరిగమెఱుంగుటంచు వగచందురుకావి మెఱుంగురంగుబఱ
గరునునుగొంగుపట్టి సురకాంతలచెంతనె పంతమాడుచున్.

క. పట్టినరంభయుఁ జేయుట
దట్టివడిం దగులఁడట్టి తళుకుబెళుకు లి
ట్టట్టుమెఱుఁగుల తెఱంగునఁ
జుట్టున్ వలగొనఁగఁ దిరిగి సురపతితోడన్.

ఉ. దేవరయాజ్ఞ కేవెఱచిరే సురనాయక ! కొంగుపట్టి న
న్నావల నొక్కయింతి నిలయంబునకుం జనఁజాలునయ్య!లో
చేవడ నిప్పుడూర్వశినిఁ జేయని యందఱనవ్వఁ జేయ నే
కావరమింక నింక వసుఁగాపుమటంచును బల్కఁబల్కఁగా.

చ. అనవిని యూర్వశీరమణి యాననమింత చెమర్ప కాలుఁగం
గొనలను గెంపుడాల్చి గుడ గుబ్బ వెఱుంగుమిటారి చన్నుల
ల్లఁజలియింప నూర్పులు దళంబుగ వెంకిగ్రమ్మనయ్యువం
గని నునువాడిపువ్వు ఫణిగోలవిధంబున ఫల్కఁబల్కెఁగా.

గీ. వేయుగన్నులుగలిగిన వేల్పుఱేఁడు
తరముగనసేర కిత్తరి బిరుదులిచ్చె
రంభ వాదాడు నిట్టి సంరంభమునను
జాణఁగుగనియిచ్చె యూర్వశినుద్దులెల్ల.

క. నాజనకుఁడు హరితల్పము
నీఁగదంపమున వెలయు నిందులనొకచోఁ
దేజరిలు నొక్కడొరచేఁ
బూజగొనిన నీదుగర్వమున కెనగలదా.

వ. అనిన రంభ రోషవిజృంభణసూచనలోచనకోణాంకురిత
శోణప్రభాప్రమేళిత కర్ణతాటంకరత్నప్రభాశంబరయగుచు
నిట్లనియె.

క. హరి మన్ననగలదంచును
గరువంబునఁబలికెదీవు కనుగానక యీ
హరిమన్నన నాకుంగల
దరయఁగ నీమహిమలెల్ల నమరులెఱుఁగరా.

క. ఇతఁడింద్రుఁ డతఁడుపేంద్రుం
డితనికి నతనికినివాసి యెఱుఁగఁగరాదే

పితృభక్తి నెద్దియేనియు
నతిశయముగఁబలికె దిది యహంకృతియనరే.

సీ. ఆదితాళము ద్వితీయకమంఠరక్రీడ
జయమంగళమ్మును జంపెలీల
చాచపుటంబు చచ్చత్పుటంబును షట్పి
తాపుత్రకంబు విద్యాధరంబు
రతిహంసలీల శ్రీరంగంబురంగంబు
కంకాళఖండకా కాథములును
కోకిలప్రియము విలోకితంబు కుడుక్క
డెంకి త్రిభంగి మట్టిగవిజయము
నందినందన జయసింహానందనములు
మొదలుగాఁగలతాళముల్ మొనసినున్న
గూడి కవచట్టముగఁ గొనియాడి తేని
బిరుదులివియిత్తునీకు నెగిరుదటంచు.

ఉ. పేరణి, తండలాస్యమును, పెక్కణి, కుండలి, నాఁజతుర్విధో
దారములై ననాట్యముల యందమునెల్ల నెఱింగియందు నే
పారుచునుండ ముందు విధులాఱునన్ని తగునంగహారముల్
రా రసభావదృష్టులలరన్ నటియించెదె మాటలేటికిన్.

వ. అనిన నూర్వశి గర్వసింధుబంధురతరంగాయిత భ్రూభంగయ
గుచు నిట్లనియె.

క. నళినాక్షుఁ డుపేంద్రుండై
బలినడవఁగ స్వర్గమర్త్యపాతాళంబుల్
గొలువఁడె పాదత్రయి నా
యలఘుమహిమ యెవరికైనఁ దలవశఁగలదే.

సీ. సంయుతాసంయుత సంజీవహస్తముల్
పదమూఁడు నొకయిరువదియునాల్గు
త్రింశద్గణంబున నృత్తహస్తంబులు
నైదువక్షంబులు నైదుఘటలు
స్కంధంబులాఱును గంధరల్తొమ్మిది
జానువులేడు పార్శ్వంబులేడు
నుత్తమాంగంబు లేకోనవింశతిదశ
బాహుల్ త్రికుక్షులుఁ బదము లాఱు
స్థాయిదృష్టులెనిమిది సంచారిభావ
దృష్టులిరువది రసదృష్టులెనిమిదియును
బొంకముగఁజూపి యింతలోపులుసెలంగ
నాడఁగలిగినఁ గలహించఁ బాడినీకు.

ఉ. అప్పుడె యేల యిప్పుడును నాఁగకమానగుగొంగు వట్టెదే!
యిప్పరుహూతుముందఱనె యిందఱుచూడఁగనీవుచూచెదే
జెప్పఁగనేల యేమనినఁ జెల్లదె విద్యలుగల్గువారికిం
దప్పక యాఁడుచాలునక తాల్మియు యొక్కటివింతలోపులఁ.

క. ఆడుము నీబిగువులు వో
నాడుము పలుకులకు నేమి యదిగాకున్నన్
బాడుము చదువుము మిన్నక
కూడునె యిటువంటిబిరుదుగొన వేమందున్.

క. అనవినిరంభ విజృంభణ
మొనరం గాంచలికి నలుక మూర్వశియానా!
నినువంటి మచ్చెకంటికి
ననువగునే యిట్టులాడి యాశించుకొనన్.

వ. అని యిట్లు వెంకియు నొండొరులమీరుచు సాటికిం బోటికిం
బాటిల్లు రోసంబున నెస నెస హాసంబులసర మణికంకణ
ఝుణఝుణనిక్వాణంబులు బెరయ రసాంబునం గరంబులు
త్రిప్పుచు మాత్సకటాక్షవీక్షణంబులం గప్పుచు నుక్తిప్రత్యుక్తి
చమత్కారంబులు మీఱ సహాంకారంబున.

క. మానిని యేకాళికి
స్థానంబుల మెఱసి నిలిచి దశమండలముల్
పూని నటియించు మెచ్చెద
మానసమున నీరసంబు మానకయున్నన్.

క. కరణములు నూటయెనిమిది
వరుసం గొనునీకు మెచ్చి వరమిచ్చెద నా
సరిఁగొంతెవత్తువని స
త్క[illegible] గలుగునిపుడ లిగసభలోనన్.

గీ. కడఁగి షట్త్రింశదుత్ప్లుతకరణములును
హావణుగమకించి యెనుబదియాఱుగగన
భూమిచారులు గలుగు నేర్పులును మెఱసి,
శ్రమమమరనిల్చియున్న నాసాటివత్తు?

గీ. అబలయాంగికవాచికాహార్యసాత్త్వి
కములనఁగమించు నభినయక్రమములమర
నమరవిభుమీఁది దరువులహొరువుల్ల
సరసముగఁగొను విరసంపుసరణులెల్ల.

ఉ. ఇచ్చట నేల యుద్ధము నిప్పుడెయోఁగి సభాంతరంబులన్
మెచ్చులుదెత్తునిప్పుకల మేల్పరికించుచు నింటఁగెల్చి యా
రచ్చను గెల్వఁగావలయు రట్టిడి చా దిటువంటి సుద్దులే
నిచ్చినఁగాని యింకఁజలియించు నెరంభయు దంభయుక్తులన్.

సీ. జలధిభంగముతోడి జనియించినట్టినీ
కే భంగమునకు నింకేలతలఁక
జలనిధిశాయికి జనియించినప్పుడే
భంగంబునీకుఁ జొప్పడకయున్న
దళమెత్తియాడిన తలవంచెదవునీవు
రంభయందులకు సంరంభమేల
దళమైనవిద్యయందము చూపకుండినఁ
దలవంపు నీకెపో తలిరుఁబోఁడి

యర్థపతిపట్టఁజేపట్టినట్టికతన
నిట్టిగర్వంబు పుట్టెనో యిదిసహజమొ
యర్థవంతునివిద్యయే యతిశయించు
నర్థమూలంబు జగమెల్ల ననఁగవినవె ?

సీ. దారుసంజీవని చారుసంగీత వి
ద్యకునుండ నీగాన మలరఁగలదె ?
కనకాంగి క్రమమెచేకొనియుండ నామ్రోల
నీయభినయమింక నిలువఁగలదె?
పుంజికస్థలశబ్దముల పుంజిగనుపించు
టకెపూన నీపల్కు ప్రకటమగునె?
క్రతుశుల్కదేశినిల్కడల కేవనిపల్కు
నీయాటపరిపాటి నగడఁగలదె ?

వెండియొక్కొకవిద్యకే వేఱువేఱ
రచ్చకెక్కినయచ్చరల్ మచ్చరించి
యుచ్చరించినమాత్ర నీ యొచ్చెమెంచ
హెచ్చియుండంగ నీగర్వ మెంతిగలదు.

క. అచ్చరలు నేఁడు క్రొత్తగ
వచ్చిరొ ? నావిద్యఁ గలుగువగలెల్లను వా
రిచ్చల నిచ్చలు మెచ్చరొ ?
మచ్చరమింతేల తేలమాటాడుదురే.

క. అనియిట్లు రంభయూర్వశి
యును గలహించంగ నింద్రుఁ డోహో ! నిలురం
భ నిలువు మూర్వశియని వా
రిని వారించుచును డగ్గరిఁ బిల్చి తగన్.

క. చెలులార ! మీమువిద్యా
విలసనములమహిమ నేఁడు వింతగఁ జూడన్
వలెనె కిరీటము వెట్టిన
తలకున్నుల్లడుగఁ బోవఁ దగునే యెందున్.

ఉ. మానినులార! మీనటన మార్గములందుఁ బరస్పరాధిక
న్యూనత లెంచ లేఁడు హరియుం దమసాటిటినిప్పు డుగ్రతం
బూనితపంబుసల్పెడుఁ దపోధనశేఖరుఁ డొక్కరుండు మీ
మీ నిపుణత్వముల్దెలియు మేకొని యమ్మునిఁ బోనుజేసినన్.

సీ. లోచూపుమఱలించి లోచనంబులువిచ్చి
సోగమీమొగములే చూచుచుండ
మంత్రస్మరణమాని మానంబుదిగఁద్రోచి
యలరి మీతోడనె పలుకుచుండ
బద్ధాసనమువీడి భావస్థిరతఁబాసి
మరలి మీవెంటనె తిరుగుచుండ
నసశనస్థితిడించి యనిలపూరణరోసి
మీరిచ్చుఫలములే మెసవుచుండ

నలమహామునిదౌమది యలరుటంప
సోనలనుముంచి తత్తపస్ఫురితతాప
మెల్లఁబో మెల్లనే యలయించి మీరు
చన్నుఁగొండలపైనుండఁ బన్నవలయు.

క. ఇద్దఱిలోపల నెవ్వతె
దద్దఱలక యతనిధైర్యధనముఁగొనెడు నా
ముద్దియకే యీబిరుదుల
పద్దులుదగు నిదినిజంబు భామినులారా!

చ. అని సురనాథుఁ డాచెలులకప్పుడు కల్పకసంభవంబులౌ
ఘనమణిభూషణంబులును గాంచనచంద్రకితాంచలంబులై
కననగుచంద్రకావి నుసుగావులుఁగొమ్మని యిచ్చి వేగ బొ
మ్మనిన కరాబ్జముల్మొగిచియచ్చరనెచ్చెలులిచ్చమెచ్చఁగన్.

సీ. చెఱకువిల్లసదని వెఱకుమా యీకొమ్మ
బొమవింటవలిమౌర్వి మోతుగాని
కాలంబుగాదని కళవళపడకుమీ
కలికిపాటలఁజూచి నిలుతుగాని
యెదఁగంమననుగుంది యెదవడకుండుమీ
సఖిమోముచాయనే చనుదుఁగాని
గందపుఁగొండపై బొందు లేదనకుమీ
చెలియూర్పునెత్తావిఁ బోలుతుగాని

మదనమాధవ శశధర మలయపవన
యనుచుఁగతిచూపి శుకపికహంసభృంగ
కేకులకు సతిపల్కులు గీతినడయు
చూపుఁగురులును బలభేది చూపిపనుప.

గీ. ఇంతమాత్రంబు మీ రానతిచ్చినపుడ
యెంతయుఁగ్రుండో? యామాని యేమిఁయైన
నేమి నీకృపగల్గిన స్వామి యెట్టి
కార్యమైనను సాధింపఁగలము సుమ్ము.

క. మందమరు దిందుమాధవ
కందర్పాదులను దోడుగా నిడుకొని సం
క్రందన కదలెద మేమిదె
మందాకినిదాఁటి నేఁడె మహిమండలికిన్.

క. అనియనిపించుకొని సురాం
గన లమ్మునిసెమ్మనంబు గరఁగించుటకున్
గనుసన్నలనె యుపాయము,
లనువుగ నూహింపుమని ప్రయాణోన్ముఖలై.

సీ. పుంజకస్థలయలంబు సమనోరమ హేమ
దారు సంజీవనిచారునేత్ర
కనకాంగి ధాన్యమాలినివపుస్మృతి శుచి
స్మిత సులోచననీల మిత్రకేళి

దేవివిద్యుద్వర్ణ దివ్యతిలోత్తమ,
చిత్రసేనఘృతాచి, చిత్రరేఖ,
జలజాస్యమేనక శశిరేఖగోపాలి
ప్రమ్లోచవిశ్వాచి పంచమాళ
లలితక్రతుశుల్క కర్పూరతిలకహారిణి,
మొదలుగాఁగల యచ్చరముదితలెల్ల
నొనరఁ దముగొల్వ రంభయు నూర్వశియును
నందనవనంబునకునేఁగి యందు నిల్చె.

క. మందారకల్పతరు హరి
చందన సంతానపారిజాతంబులచేఁ
బొందుగ భూలోకంబున
కుం దగిన సువస్తుతతులుఁ గొనుచున్ వేడ్కన్.

క. నందనము వెడలి పయనఁపు
టందము గజవాదిపూంత లలఁది తొడవులం
గుందనఁపుటంచువగజిలు
గుం దెలిసాలియలు జారుఁగొప్పులు నొప్పన్.

చ. నడచిరి యంత రంభభవనంబున నుండెడుసోమయాజు లె
క్కుడుతమిఁ బాయలేనివడిఁగూడఁగరండిటు వాజపేయు లె
క్కిడిపయనంబువచ్చె మనకర్మము లీగతినుండ నేఁటికిన్
జడిసెదు పౌండరీకులని సారెకుఁబల్కుచు నెండకల్కుచున్.

క. పెంజెమటజార దోవతి
పింజెలుమాటికిని గాళ్ళఁ బెనఁగొనఁ గడుపుల్
గుంజెలు పెట్టఁగ వేలుపు
లంజలఁ గూడంగఁ జని హాళాహాళి మెఱయున్.

సీ. రత్నకంబళమతి రాత్రులుగొంచురా
సర్వతోముఖులు వేసరఁగనేల ?
తాళవృతంబు మాపాలిది చయనులు
జగడంబులాడక చనుఁడు కడకుఁ
గపురంపుఁ బెట్టె మీకట్టడయెఱుఁగరా ?
సత్రయాజులకింత చలముగలదె ?
ముత్యాలచౌకట్ల మూటమామోపాట
తెలియదే ? వాజపేయులకు నెపుడు
నాఁడె క్రతువులు రామార్పణముగఁ జేయ
కుని కిమేపాటు వాటిల్లె మనలకనుచు
సారిదిఁ జనుదెంచుయజ్వలఁ జూచి నవ్వి
యవ్విబుధకామినులు వారి ననిపి యచట.

క. తగువారి వెంటరమ్మని
గగనంబున నడచి రింద్రుఘనసౌధంబున్
మగుడి మగుడి చూచుచు న
మ్మగువలు మఱి వారినంటి మార్గమునందున్.

ఉ. పట్టుగుడారముల్ చికిలి బంగరుగ్రావ్రాఁతల చిక్కుబీగపుం
బెట్టెలుఁ బచ్చతాపలకపీటలు మేలివకాసుకట్టుమేల్
కట్టులు గ్రొత్తనత్తపలకల్ తెరలుం బెక దాఁరిఁబారువా
బిట్టలగూండ్లుఁ గ్రొమ్మెఱుఁగుబిందెలుఁ గొండలు తెచ్చిరయ్యెడన్.

సీ. దంటనీలంపు చిక్కంటలు దంతంపు
దువ్వెన లక్కంకుమ పువ్వుఁబజాపు
సకినలమంచముల్ చౌకంపుఁబొంబట్టు
బటువులురాచిల్క పంజరములు
పరిమళంబులయుబ్బు బరిణలు చంద్రకాం
తపుఁగోరలు విరికుందనపుగిండ్లు
నిలువుటద్దములు వీణియలు దండియలును
దాళము ల్వేణువాద్యము లురుమలు
నారజంబులు ముఖవీణలానకములు
మద్దెల లుపాంగములు స్వరమండలములు
మొదలుగాఁగల సాధనంబులు ధరించి
కొంద ఱరిగిరి వెనువెంటఁగూడి యపుడు.

సీ. భృంగంబ! చెలిచూపు బెళుకులో నిలువుమీ!
మొక్కలంబుననొంటి మొక్కపోక
చిలుకచిలుకలకొల్కి పలుకులో మెలఁగుమీ!
నీరంబునను జెలి! బీరువోక

యంచయంచితయాన ! యదుగులోనదువుమీా!
బింకంపునసుమదం బింకిపోక
కోయిలకలకంఠి ! కుత్తుకై యుంసుమీా !
మోడితోఁజని మొగమోడిపోక
ననుచు బలములమున్నుగా ననిచి తనకు
వెన్నుఁబలమయి మాధవ విధుసమీారు
లంటినడవంగఁ గదలెఁ బూవింటిజోదు
దండనుద్దండ పుండ్రకోదండుఁ డగుచు.

ఉ. ఇక్కరణిం బురందర పురేందుముఖుల్ చనికాంచిరెంతయుం
జక్కనిచాయ నుల్లసితసారసహంసరథాంగభృంగ స
మ్యక్కలనాద మేదురనిరంతరతుంగతరంగఘోషముల్
దిక్కులనిండఁ జాంకురుచిఁదేరు సురాపగ వేడుకల్గగన్.

గీ. కాంచిరంభోర్వశులు మదిఁగౌతుకమున
విష్ణుపదియన నీనది వెలయుఁజూవె
యిందుకుల్యల సాఫల్యమొందు మనదు
నందనంబును దీనికి వందనంబు.

వ. అని నమస్కరించి వెండియు నయ్యండజయాన లొండొరు
లంగనుఁగొని.

ఉ. కన్నెమిటారి బేడిసలు కన్నులచెన్ను వహింపజక్కవల్
చన్నులచంద మొప్ప జలజాతపరాగము హత్తి ప్రత్తిపూ

వన్నియలీలనొప్పఁ గనులారవిలాసిని వోలె నందమై
యున్నది యిన్నదీమణితిలోత్తమచూచితె? యెంతయొప్పెడున్.

క. అభ్రకరిజలములోపల
సభ్రమువుందాను గ్రీడలాడెడుఁగంటే?
విభ్రమమున నిచటే మ
త్తభ్రమరములల్లగండ తలముల నిండన్.

చ. తగడపుఁజాయముక్కులును బాదయుగంబులుఁ బైఁడిరెక్కలున్
జిగినునుసోగవెన్నెలలఁ జిమ్మెడుమేనులు మించనంచలీ
గగనతరంగిణీవికచకాంచనకంజ వనీగృహంబులన్
సొగసి, రమింపుచున్నయవి చూచితె? చారుచకోరలోచనా.

క. అనితన్మహిమముఁ బొగడుచుఁ
జనిచని తమసాతటంబు చాయనె గగనం
బుననుండి దిగిరినిర్జర
వనితలవనితలము నవయువద్యాశ్రిగమ్మన్.

సీ. జలదకదంబముల్ చంద్రబింబంబులు
శరభముల్ విద్రుమసముదయములు
శంఖసంఘములుఁగాంచనలతావలయముల్
చక్రవాకంబులు జలరుహములు
మెఱుఁగుఁదీగియలుఁ గ్రొమ్మించుమానికములు
నావర్తములు సైకతావళులును
కరికరంబులు శాలకమతముల్ మౌక్తిక
పాళికల్నవ్యప్రవాళములును

గగన జలనిధిలోనుండి కలసిమొక్క
పరియతోరిగనో యనఁగఁజూపరకుఁదోఁచెఁ
గాంతతరలీల గీర్వాణకాంతలెల్ల
తీవిమెఱయంగ నవనికి డిగ్గునపుడు.

సీ. వియదంబునిధినుండి వెడలివచ్చునసేక
లావణ్యమయమాయ లక్ష్ములనఁగ
బ్రహ్మాండఖనిఁబుట్టి పఱతెంచుజీవ క
ళాకలితమణిశలాక లనఁగ
జలదబృందంబులోపలనుండి దిగువకే
తెంచు కారుమెఱుంగుఁదీఁగె లనఁగ
మిన్నేటినుండి భూమికివ్రాలు గన్నెప్రా
యఁపుమేలిపసిఁడి రాయంచలనఁగఁ
జూడఁదగియామరుల్లోకసుదతు లవని
కవతరింపుచుఁ దమసాతటాంచలమున
నిలిచి తమతమసారస్యములుసెలంగ
మెలఁగుచుండంగఁ బరిచారకులు గడంగి.

క. అమ్మౌనితపమొనర్చువ
వమ్మునకుం గట్టెదురఁగనందగుబయలన్
గ్రమ్మకొని పొదలువకుళకు
లమ్మల ఘుమ్మను సమస్థలంబున నొకచోన్.

చ. సమముగమిట్టపల్లములు చక్కఁగఁజేయుచుఁ జుట్టి నీరువా
టముఁగని నాల్గువంకల గుడారములెత్తిరి చీనిపట్టు ప
గ్గములు బిగించి గూటములుఁగట్టినరాతులగూర్చిముందటం
గొమరగు పైఁడితీవ పనికట్టుల చప్పరముల్ చెలంగఁగన్.

ఉ. అక్కడి చాయరంభయును నాత్మసఖీమణులెల్లఁ గొల్వఁగా
నెక్కసలాడు రాచిలుక నెక్కపుమేలిగుడారునందు సొం
పెక్కవసించె నూర్వశియు నిష్టవయస్యలఁగూడిగండుమీన్
చెక్కియపుంగుడారమునఁ నిల్చెఁబథ్రశ్రమముల్ దొఱంగఁగన్.

ఉ. అంతట నంశుమంతుఁ డపరాంబుధిఁజేరె శకుంతసంతతుల్
బంతులుగట్టిగూళ్ళకెగఁబాఱఁగ సాగె దిగంతసీమలన్
సంతమసంబుపేరె జలజంబులుదారె రథాంగపంక్తికిన్
గంతులుదీఱె నుత్పలవనంబులనాడఁగఁజేరె భృంగముల్.

సీ. గగనాంబునిధిలోనఁ గనుపించుమౌక్తిక
నికరంబులనఁగఁ దారకలునిక్కెఁ
దారకాంగనలెల్లఁ దమినాయకుందకం
దుకము చందమునఁ జంద్రుండుదోఁచె
చంద్రుఁగన్గొని పాలసంద్రంబుపై కుబ్బి
నిండెనాఁ బండువెన్నెలలుగాసె
వెన్నెలబైట గర్వించి పంచశరుండు
కలువతూపులను లక్ష్యంబులేసె

గలువతూపులమర్మము గాఢబెదరి
పదరిమె త్తనితలిరాకుఁ బాన్పులందు
బల్లవులఁ గౌఁగిలించిరి పల్లవోష్ఠు
లలఁతి తెమ్మెరనమ్మెని యలఁతదీర్ప.

చ. నిలిచిన తేటవెన్నెలలనీడలు చూచుచుగట్టి వెన్నెలల్
జిలుగుమెఱుంగు ముక్కుతుదఁజించిమెసంగుచుదప్పిగప్పినం
బలుచనితియ్యవెన్నెలలబానముసేయుచుఁ బ్రేమడాయుచున్
మెలకువమించచన్యోడ రమించఁదొడంగెఁ జకోరదంపతుల్

క. ఇమ్మాడ్కి జనానందక
రమ్ముగ వెన్నెలలుగాయ రంభోర్వశులున్
గుమ్మెతగుడారములకడ
ఘుమ్మను కపురంపుజగతిఁ గూర్చుండి తగన్.

గీ. దండియలు మీటి రహిగానదంతిచెలఁగ
నింద్రుమీఁదటిపదము లెన్నేని వింత
వర్ణములఁబాడి యుత్పలవాసితంబు
లైనగంధోదములు గ్రోలి వాళిదేలి.

ఉ. చొక్కుచునచ్చటన్ మదముసొంపునసోలుచునుండియంతటం
జక్కనిపై డిలీవవని చప్పరమంచములన్ వసించి రిం
పెక్కఁగ నూడిగంపు జెలు లివ్వల నవ్వలఁ గంకణధ్వనుల్
పిక్కటిలంగఁ దాళగతి లీలలుహత్తి పదంబు లొత్తఁగన్.

సీ. ఇటులవ్వధూటులు వటగృహంబులలోనఁ
బవళించియనాటితపంబుఁ జెఱుప
నెద్దియుపాయంబొ ? యద్దివ్యసభయందు
మనలకుఁ గీర్తిగల్గునొకో ? యింక
ననివల్కుచొక్కింత కనుమూసిరో మూయ
రో యంతలనె తూర్పుననువేఁగుఁ
జుక్కగన్పించె నల్దిక్కులు దెలుపెక్క
నరుణోదయంబయ్యె నిరులువిరిసెఁ
గుక్కుటంబులు "కొక్కొరో కో"యటంచు
మ్రోసెఁబక్షులకలకలంబులు చెలంగె
వనజములుమెల్ల ముకుళభావములువదలెఁ
గదలెఁదమజోడుగూడిఁ జక్రవలు వేడ్క.

క. ఉదయించె సూర్యుఁడంతట
నుదయాహార్యంబునెల్ల నుగ్రసహస్రా
భ్యుదితారుణరుచిమేలిమి
యుదిరి పసిఁడికొండ పగిది నుండంజేయన్.

వ. ఆసమయంబున.

క. ఉప్పవడంబై వేలుపుఁ
గప్పురగంధులును వేడ్కఁగై సేయుచు నేఁ
డప్పరమమౌనియుండెడు
చొప్పరయుదమనుచు నడుచుచును దమలోనన్.

క. గ్రక్కున నే జనరాదచటికిఁ
జక్కఁగఁ గుసుమావచయ విషంబున సొంపుల్
నిక్కంగఁ జూచి యతనిం
జొక్కింతము మానులింత సులభులె? తలఁపన్.

క. అని పల్కుచుండినంతను
మునువె వసంతుండు పికసమూహము పొగడన్
మనసిజుఁడు నెగడ మలయప
వనసహితుండగుచు నచటి వనముల నిల్చెన్.

సీ. మోదుగుల్చిగిరించె గేదఁగుల్పనలొత్తెఁ
గురువిందములుఁ గలిగొట్టుఁజూచె
మల్లియల్ గొనసాగె మొల్లమొగ్గలువైచె
మావులు గ్రోవులు దావి నెసఁగె
బొగడ పుప్పొడిరాల్చెఁ బొన్న తేటలఁబొల్చె
నిమ్మయు గోఁగుఁదేనియలు గురిసె
సంపెఁగ వికసించె జాజు లమ్మదాల్చె
గోరంట తిలకంబు గుత్తులెత్తె
వావిలియుఁ బ్రేంకణంబును వంజులంబుఁ
గడిమి చెట్లులు నలరె నప్పుడు వసంత
సన్నిధి విశేషమున వనస్థలమునందు
భువియు దివియును ఘుమ్మని పొదలుచుండ.

వ. ఇవ్విధంబున వసంతంబు శుకపిక శిలీముఖ ముఖరితాఖిల దిగంతంబగుచు విజృంభించుచుండ.

ఉ. చందురు కావిపావడల జాజు పిటుందులఁ జిందుద్రొక్కఁగా
గందపిసాళి పాళియలుగట్టి కదంబపుఁ బూఁత తావికిం
జెందిన తేఁటిదాఁటులనఁ జెన్నగు కీలుజడల్ నటింపనా
సుందరు లందఱున్ వనము సొచ్చి దలన్మణినూపురంబుగన్.

ఉ. కేరుచు నవ్వధూమణులు కేలివనిన్ విహరించి కొందఱం
జేరుచుఁ గన్నెగేదఁగులఁ జీరుచుఁ బూబొదరిండ్లు వేడుకన్
దూరుచు రాని నెచ్చెలుల దూరుచుఁ గమ్మని పువ్వుతోఁట్లలోఁ
గూరుచు సారసౌరభముఁ గూరుచుచల్లనిగాడ్పుఁ గోరుచున్.

రగడ.

నిచ్చ నిచ్చగ నలరుదండలు నిండ నిండ యనంగుఁ జెలులకు
విచ్చ విచ్చన విడివిరుల్ గురువింద విందొనరించె నలులకుఁ
గలికి కలికిలతలను దుస్సాద గఁతు గంతులు చూడుమాటికిఁ
చిలుక చిలుకల కొల్కి పలుకులఁ జిక్కఁ జిక్కులఁ బెట్టనేటికిఁ
గంతు కంతుకము లనఁదగునిది గాదె గాదెకు మిగులు గుత్తువె
చెలియ చెలియల నీకు నేనన జిర జిరఁగదిలి చెంత వత్తురె
చిలువ చిలుకు మరందరసముల జెట్టచెట్టల విద్య మెత్తురె.
కన్ను కన్నర చేయునేటికి గానఁగా నవమల్లి మొగడలు
నవ్వు నవ్వన నీకుదగునటె నవ్వ నవ్వుల లేవెపొగడలు
మోదు మోదుగ పువ్వు రెచ్చెను మున్న మున్నర కైకముచ్చిరి
[illegible]

లేదు లేదుండఁగ ముదిరికిన్ని లేమ లేములు పాట వచ్చిరి
దాడి దాడిమములకుఁ బెట్టెను తరుణి తరుణిమ గర్వమెంతన
నీడ నీడలు నిండెఁ బ్రేమము నిక్క నిక్కడ నిత్తమింతన
కంటె కంటె యొనర్చునది శుభ కాంతి కాంతికి లతికజాతికి
సంటునంటునఁ బుష్పకుల నదినాననానఁగఁ జేసినాతికిఁ
హాళిహాలి కుచంబులంటిన నాతినాతికనాన దిట్టను
బాళిబాలిక పువ్వు లేదని పల్కఁబల్కను గోవృకట్టెను
కలికి కలికుచ యీపునమ్మదిఁ గ్రమ్మఁగ్రమ్మఱ వాసువట్టను
దళమూదళముగ రాతిసరిపోద దంశదంశము నికుమెట్టను
యిప్పుయిప్పటి కింపునింపెఁను నింగునింగుని భాస్వనిత్తను
యప్ప యప్పగువాపు మొగ్గల యాసయాసతి వల్లఁదెత్తమె
చామచామనమేని యాచెలి జడనుజడను వడంగ వ్రేసెను
రామరామ మకరందఘనసును రాజరాజిల నదియకోసెను
మాదిమాది ఫలంబుశేగదిటు మలయమలయజగంధి ముందఱ
ననలననలస గతులఁగోసి చనంగనంగన యిపుడు వచ్చెను
మనముమనమున నెపుడునీచెలి మాటమాటగనిటులు హెచ్చెను
చాలుచాలునగంటి మీరల సరససరసము లాడఁగూడదు
మేలుమేలుపడెన్ లతాంతము మీఁదమీఁదటి యెత్తుమాసకు
లలన లలనద పుష్పగుచ్ఛల లామలామజ్జగముగంటిరె
యలికియలికి లతాంగిగ్రొవ్విరి నంటనంట పొసంగవింటిరె
వామవామగతిం జెనకియురు వంకవంకటు చూచువింతలు

హేమహేమనవచ్ఛా నచ్ఛాలి కీరకీరము వియ్యముచ్చట
రాలరాలఁగ దుర్వాలిడిస్సిఁగ రాఁగరాఁగఁ మేదియింతలు
యరసియరసి కరాతటస్థలి యాదయాందఱు వలయుఁ జేరఁగ
సరసిసరసిజములును గొనుఁడు వసంతసంతత కేళిమీఱఁగ.

క. అనివసిలో విహరింపుచుఁ
జనిచని చంద్రముఖు లిష్టసఖు లిరుగడలం
గనిమనికొలువఁగ నట య
మ్మునియునికి నేఁగి యతనిముందఱ వేట్కన్.

ఉ. తేనియ క్రొన్నన ల్పసిమి తియ్యని తియ్యని పండ్లుజాలఁగా
గానుకగాఁగనుంచి పదకంజములం బ్రణమిల్లి లేచి యో
మౌనివరేణ్య! పుణ్యమహిమన్ మిముఁగన్గొనఁగల్గెసత్కృపా
నూనకటాక్షవీక్షణము నూనఁగఁ జేయుము మమ్ము నిత్తఱిన్.

క. అసకలికి యతఁ డొకింతయుఁ
గనుదెఱవక పలుకకున్నఁ గని యందఱు నా
మ్మౌనమున నచ్చెరువందుచు
మును చెన్నఁడు గానమిట్టి ముని జగములలోన్.

క. గట్టిగను మూఁగదయ్యము
పట్టినదో కాక చెట్టో బలురాచట్టో
యిట్టులు మనమిందఱమును
జుట్టుంబిలువఁగ నొకింత చూడకయున్నే.

సీ. హరినీలములతోడ సరినీటువచరించు
కప్పుఁదేరెడు మెఱుఁగొప్పుచొప్పు
దీటేసపడి మించి కోటేరువెట్టిన
మురువుపూవుబట్టెడు ముక్కుచెక్కు-
పాలుగారుమెఱుం గంద్రమేలుగానఁగనొక్క
మోవాసబ్బగు నగుమోముఁగోము
వాటమౌ రత్నకవాటమౌ నిడియునఁ
జాల శోభిలెడి వక్షంబుదంబు
తళుకుబంగరుముప్పిరి తరఁటువోలె
నున్నయది మేను చూడంగ నున్నతంపు
విటుఁడయుచరించి కొన్నాళ్లు వెతకఁదపసి
యయ్యెఁగా కిట్టి యందమెందైనఁగలదె.

క. కనమే బిరానవార్వ
రినపచ్చనిమొడలు జేగురించిన జడలుఁ
బెనువంకమెడలుఁగల య
మ్మునిజడలన్ సొంపులెసల ముల్లోకములన్.

క, యువతులసంగతులం గల
చవులెఱుఁగఁడు పుట్టుమొదలు సత్యముగాదే
నవలాలచూపుదలలన్
దవులనివాఁడుం గలాఁడె ధైర్యముతోడన్.

వ. అని మాధవుఁ డన్నివిధంబులం బలుకుచుండ రంభ యిట్ల
నియె.

క. మద్దైలసద్దన నీతని
నిద్దురమబ్బల్లఁబోవ నేర్పు మెఱయ నే
నిద్దముగ దేశిఁ గొలిచెద
నొద్దికగానుండుఁ డనుచు నొవరిచి సఖులన్.

క. బంగరుకాసెయు ముత్తెపు
రంగుల చనుకట్టుఁబూని రంభ మిగుల దై
సింగారము వెలయఁగ ముని
పుంగవు నెదుటన్ మెఱుంగుపోలిక నిలిచెన్.

క. నిలిచి యటునడిచి పుష్పాం
జలిచేసి యసంయుతములు సంయుతహస్తం
బులుచూపి పసిఁడి గజ్జెలఁ
జెలఁగెడు చరణములు రవళిసేయుచు వేట్కన్.

సీ. తరుణీమణి యొకర్తు తంబురా మొరయించ
వెలఁదియొక్కతె ముఖవీణెయూఁద
సరసిజాక్షి యొకర్తు స్వరమండలము వాఁచ
బోటియొక్కతె దండమీటిపాడ
విమలాంగియొకర్తు వీణెయఁబలికించఁ
గలికియొక్కతె యుపాంగంబుపూనఁ
గిసలయాధరయొకర్తు కిన్నరమీటంగ
లోలలోచనయొకర్తు తాళము త

మఱియుఁ గొందఱు సుదతులు మద్దెలయును
నాదజములు మొదలైన వాద్యములు వట్టి
శ్రుతులు ఘుమ్మని హావణించి సతివదేశి
నృత్తవైఖరి చూపి మునీంద్రు నవుట.

గీ. ఇటుల మిగుల నేర్పు ఘటియిల్లఁ జూపి
నృత్యగీతవాద్య నిపుణమార్గ
పటిమ చెవిటి మ్రోలఁ బాడినసంకు నా
ఫలము లేకపోవ బదరి రంభ.

సీ. ఒకకోపు చాలదే శుకవామదేవుల
కైనను దపము వాయఁగఁ జేయ
నొకచూపు చాలదే సకలదేవతలను
మోహమహాంబుధి మునుఁగఁ జేయ
నొకపాట చాలదే యుర్విలో శైల సం
ఘములు నీరుగఁ గరఁగంగఁ జేయ
నొకమాట చాలదే యుల్లోలకల్లోల
ముగఁ దేనె వంకలు నిగుడఁ జేయ
బూని యిటువంటి బిరుసు కోపులును బెళుకుఁ
జూపులును వింతపాటలు సొగసుమాట
లు రహి నెన్ని చూపిన మదిగరఁగదయ్యొ
దయ్య మేమని పుట్టించె నయ్య వీని.

వ. అని మఱియు ననేక ప్రకారంబులఁ బలుకుచుఁ దమనటన
చాతుర్యంబున నతిధైర్యంబునుఁ దన విలాస భావంబుల
నతిజడభావంబును దేజస్తిమిర సంపర్కంబు నుంబోలెనొ
క్కంతి యలంబొంపు వడకయున్న డెందంబునం గలంగుచు.

గీ. చిన్నబోయి రంభ చెక్కటఁ జేయిడి
యున్న జూచియంత నూర్వశియును
నేనొకింత దడవుగానంబుచే మౌని
మనసు గరతు ననుచు నవుచు వేశ్య.

చ. సరిగ మెఱుఁగుఁ జాటకుబుసంబునఁ జన్గవబిక్కటిల్ల మే
ల్తరమగు కావిపింజియపదంబులఁ జింకులు ద్రొక్క బచ్చక
ప్పురమున హెచ్చుకుంకుమపుఁ బూఁతసుగంధము చౌదుముట్టఁగ్రొ
వ్విరిసరులన్ సికుల్దొలకు వేణిచలింపఁగ వచ్చి యచ్చటన్.

క. మునికట్టెదుర నొయారము
దనరఁగఁ గూర్చుండి యొక్కతరుణీమణిఁగ
న్గొనిపీణియఁ దెమ్మని చ
క్కనిపలుకులఁ దేనెలొలుకఁగాఁ బలుకుటయున్.

సీ. తళుకు నీలపు దట్టములువోలె నీకలు
గానంగఁ దగు గుబ్బకాయలమర
రతనాల పూసల రాజిల్లెడు సిరాజి
పగడంపు మెట్లులజిగి దొలంకఁ

ప్రచురరాగ లతాంకురములు ప్రాకినలీల
మెఱుఁగారు తంత్రులు మీటుచూప
ఘుమఘుమ ధ్వని నించు గ్రొవ్విన యుపరంజి
కళుకుల యచుసుల యొళుకుదనర
జీవ రత్నంపు మెరుపు చికిలి కెంపు
బిరడలును గరుడ పచ్చల కదవెక్కి
వ్రాత పూఁబట్టు గవిసెనరాణ దనరు
వీణె యొకయింతి నిల్పెను వెలఁది యెదుట.

వ. ఇట్లు తెచ్చిన పడంతికి నమస్కరించి పాణి యుగంబునఁ గైకొని.

సీ. గవిసెన సడలించి కరపంకజద్యుతి
గడలు కోఁజేని పావడలు నుడిచి
బలితంపు మెఱుఁగు గుబ్బలమీఁదఁ దీర్చిఘు
మ్మన నఖంబుల శ్రుతులంటిమీటి
జవ్వాదిఁ బదనిచ్చి సారణులాన్చించి
సరసత బిరడల్లు చక్కనొత్తి
మంద్రమధ్యమ తార మహిమమీఱఁగఁ ద్రి
స్థానంబులును మెట్టి తాళగతుల
నతులకంకణ ఝణఝణత్కృతులు సెలఁగ
మాయ చేయన రాగమ(లాలా)యములును
గీతములు ప్రబంధములు రక్తిఁగనుపించ
వీణెమీటెను నానీలవేణి యపుడు.

మ. లలనారత్నము గానమాధురికి శైలంబుల్గరంగెన్ మృగం
బులు మేపుల్విడి చూచుచుండె నచల న్మూర్ధాగ్రకర్ణంబులై
చెలఁగెన్ బక్షిగణంబు ప్రోదులు చిగిర్చెన్ మాని డెందంబుని
శ్చలభావంబున సంతసంతకుఁగడున్ సంధించెఁగాఠిన్యమున్.

క. అదిగని యూర్వశినవ్వుచు
నదిరామదితాయివంటి దనియెడు పలుకుం
జెదరె చుపాయనమొక్కటి
వెదకవలయు వీనిమదికి విశ్వములోనన్.

శా. ఔరా రాగము బాపు రేయొదుగురాయంబుల్ బళీస్థాయిసం
చారీ ప్రాపులు లెస్స కంపితము మైచాగో హహో మేలమ్మ యా
య్యారే మీటుకోలంబు పాడఁదగునా హారక్తియుంచున్ సభా
స్తారుల్లేరిట మెచ్చ నీజడుఁడు మెచ్చున్ నేర్చునే గానమున్.

క. అనిపాక్కిలికి రంభం
గనుఁగొని మనతగవుఁదీర్చెఁగా మునితపమే
ఘనులతపంబులు చెఱుపం
బనిచిన నీకేఁ జనఁగవలదు పదివేలైనన్.

క. అప్పయుఁజెల్లెలు బలెమన
మెప్పుడు నీకేఁగూడియుండ మిద్దఱమును సొం
పొప్పనని హీరు పాళియ
మప్పుడెమొత్తివడి సరిగి రమరావతికిన్.

వ. ఇవ్విధంబున రంభోర్వసులు తమ యఖర్వగర్వాంధకారంబు
మునిలోకబాంధవు తేజఃప్రభావంబున దూరంబగుటయు
నిర్విణ్ణహృదయలై సురపురరాజధానికింజనిన యనంతరంబ
యనంతశాంతగుణమణిభూషిభూతి తపోధనుండగు నాథునుం
డచ్చటికి నాయచ్చరమచ్చెకంటులు వచ్చుట పోవుట యెఱుంగ
గక యభంగధ్యాననిష్ఠాగరిష్ఠుండై చెలంగుచుండె.

సీ. సంచారమాచెంత నించుకంతయు లేమిఁ
  జెదలుఁ బ్రుట్టలు నేల మెదలఁదొడఁగె
జెదలుఁ బ్రుట్టలతనిఁ గొడుగబుట్టలు వెట్టి
  బుట్టకోవులలోనఁ బుట్టెఁ జెట్లు
చెట్లయందే ప్రవేశించి నాల్కాలు గోయు
  పెను బాములను దీఁగెలును బెనంగె
దీఁగెలంతంతట దిరిగి గూండ్లుగట్టె
  గూండ్లలోనఁ బక్షులు సెలంగె
నంతరాంతరములయందు దంతిసింహ
శరభశార్దూలసింహంబు లిరవుకొనియె
శార్ఙ్గివకళేబరంబు లోపల వెలుంగు
నంతరాత్మయుఁబలె నతఁడంతనుండె.

క. అటప ప్రస్రులు హిమవ
త్కటకవినోదములుచూచి క్రమ్మరి తమ తా
తటమునకువచ్చి యచ్చట
నటు నిటుఁ గనుఁగొనుచు వారలందఱుఁదమలోన్.

ఉ. శుష్కవనంబు మున్ను చటఁ జూడఁగనేఁడిదె వింతవింతలై
పుష్కరిణీరసార్ద్ర కణపూరిత శీతలవాతపోతకా
విష్కృతపుష్పనిష్పతదవేల రసాల మరందకందళీ
పుష్కరనిర్ఝరుల్మిగులఁ బొల్పువహించె మనోహరంబులై.

సీ. ముందుకోరందలేకందు మొందునునెందు
నల్లొనేరేడు లెన్నియల్లుకొనియె
మున్ను సన్న పుటీఁత ముగ్దలీచెంగట
సురపొన్న గుంపము ల్జొంపమయ్యెఁ
దొల్లియంతటదంతె దొంతరలీచెంతఁ
దీయమామిడులెన్ని మూయనెదిగె
మునుముమ్మరపుఁదుమ్మె మనుగంపులీవంక
బలువేరుపనసలు బలిసెఁజాల
నాఱుఋతువులఁబుష్పంబు లలరుచున్న
వింతవింతలు మనము నేఁడేఁడులయ్యె
హిమగిరికిఁబోయి యింతలో నెన్నిపుట్టె
దేశకాలవిశేషము ల్దెలియ వశమె.

సీ. పులుమేపులునుమాని పులులవీపులు మెట్టి
గునిసియాడెడు లేటి కొదమలిచట
దమినీలకంఠకంఠముల హారంబుల
బాగుజూపెడుఁ గోడనాగులీడ

సింగంపుఁగూనలఁ జేపట్టియాడుచు
నున్న విచేయుంగు గున్న లిందు
ముంగిసల్ మూషికంబులు నొక్కచిక్కునఁ
జెర్లాడుచున్నవి చెంతఁగూడి
యింతవింతదలంపఁగ శాంతిమంతు
డెవ్వఁడో యొక్కయోగి యీయెడవసించి
తపముసలిపెడుఁ గాఁబోలు నిపుడుగాక
యుండునే యిట్టి మహిమంబు లొనరుచిట్లు.

వ. అని పొగడుచు మఱియును.

క. ఇక్కడఁగాఁజేమసలన్
ముక్కడజిచె నొక్కబోయ మును మునుకొనివా
డెక్కడఁబోయెనో యిపుడన
గ్రక్కుననాకాశవాణి గంభీరముగన్.

క. ఈవల్మీకంబుననదె
శ్రీవల్లభభక్తసులభు సీతారమణుం
భావింపుచు నున్నాఁడనఁ
గా వారలరాక యెఱిఁగి గ్రక్కున వతఁడున్.

శా. ఆవల్మీకముఁజించికొంచు నుదయాహార్యాంతరాళంబు నం
దావిర్భావమునొందు భాస్కరునిచాయన్ శోణశోణప్రభా
వ్యావల్గత్కిరణంబులోయన జటాప్రాంతంబు శోభిల్లఁగా
వేవేగంజనుదెంచి యమ్మునుల సేవించెం బ్రియుంబిచ్చఁగన్.

క. సేవించి నిలిచి యంజలిఁ
గావించి మునీంద్రులార కరుణాంబుధులా
రా వినుఁ డేమీవలనం
బావనభావంబుఁ జెంది మాన్యుఁడనైతిన్.

వ. అనినవిని యమ్మునీంద్రులందఱు నానందంబున.

క. ఈజటలీ కృష్ణాజిన
మీజపమాలికయు కాంతిమెట్లుగలిగెనో
యీజగదాంగకు నోహో
శ్రీజానిస్మరణమహిమ సెప్ప నశక్యమే.

సీ. ధరనన్నిపుణ్యతీర్థములైనఁ గలుగనీ
రామనామముసరిరావు దలప
నిర్మలస్థితిమించు నిధులెల్లగలుగనీ
రామనామముసరిరావు దలప
నానావిధములైన దానముల్గలుగ నీ
రామనామముసరిరావు దలప
నతిశయంబుగమహావ్రతములుగలుగ నీ
రామనామముసరిరావు దలప
రామనామంబె సారంబురామభద్ర
రామచంద్ర రఘూద్వహరామయనుచు
ననయము జపింపవలయు దక్కినవియేల
రామనామంబునకు సరిరావుదలప.

వ. ఇదియంతయు రామనామస్మరణంబకాని వేఱొక్కటిగా దెట్టి
పాపిష్ఠుండైన నష్ఠాగరిష్ఠుండగుచు శ్రీరామస్మరణంబుసేయ
సకలభోగంబులు గలుగుట నిస్సంశయంబు వీడు ప్రహ్లాద
నారద పరాశర వ్యాస పుండరీకాదులలో నొక్కఁడుగాని
సామాన్యుండుగాఁడని సన్నుతింపుచు సముచితంబుగా వాని
వీడుకొని యథేచ్ఛం జనిరి. వాఁడు నవ్వల్మీకంబునం బుట్టుట
కతన వాల్మీకియను నామధేయంబు వహించె నవ్వాల్మీకి
మహామునియు నంతకంత కంతరంగంబున నుప్పొంగు భక్తి
విశేషంబున నిరంతర జపశీలుండై యుండ నతని చిత్తశుద్ధికి
నలరి రామభద్రుం డొక్కనా డతని యగ్రభాగంబున.

సీ. కోర్కులపంటగల్గుటకు వ్రాలెడుమేఘ
మనఁగ వినీలకాయంబుమెఱయ
ప్రణతులకాయువుల్ వ్రాయు తూలికనాఁగ
వాలికతూపొక్క కేల నమర
హస్తదైర్ఘ్యముచూపు ననువునఁ గాంచన
ఘనకార్ముకము భుజాగ్రమున వ్రేల
నీలాద్రిమేఖల నిండారునీరెండ
చెలువునబంగారు వలువదనరఁ
మహితకరములజిగిగండమండలమున
దాండవముజూప నుద్దండపుండరీక
పత్రరుచిహిండనంబులఁ కాలువెట్టు
క్రాలుఁగన్నులఁ గృపయొల్కఁగానుపించె.

సీ. పసిడిగింటెంపుమెప్పుటికక్కు లోహసోహసో
కమ్మకస్తూరితిలకమ్ము ఫలిర
కరచాపములయొప్పు పలవియమ్ముమ్మ మా
ణిక్యకోటీరంబు నీటువాఫు
నిగనిగమెఱుచిన్న నగవులాహా మణి
మకరకుండలముల మహిమమేలు
తళుకుగుంకుమపు గందపుబూతయుహ్యారి
హారవల్లికల యొయ్యారమౌర
మించునననెంచఁదగులీలఁ గాంచి మించి
మించిజగిమించు నెమ్మేని మెలతగూడి
చల్లఁజూపులఁ గరుణారసంపుఁజల్లు
జల్లుచును నిల్చె శ్రీరామచంద్రుఁడెదుట.

గీ. జానకీజానియిట్లు సాక్షాత్కరింప
నత్తపస్వియు నానంద మత్తచిత్త
వృత్తుఁడగుచును నతులుగావించి లేచి,
కరయుగంబు నిటాలభాగమునఁ జేర్చి.

సీ. జయదశరథ సుధాజలధిరాకాచంద్ర
జయతాటకాభిధా చటులబాణ
జయగాధినందన సవనరక్షణదక్ష
జయసుబాహుప్రాణ శమనబాహ

జయగౌతమాంగనాశాపవిమోచన
　　　జయకృశానంగ జిచ్చాపభంగ
జయభూమికన్యకాకౌతుకము లీలాలోల
　　　జయవాలి విగ్రహాశ్చర్యశౌర్య
జయపయోనిధిలంఘన జాంఘికబల
జయదశానన ఖండనచండకాండ
జయవిభీషణ పోషణాసక్తచిత్త
జయమయోధ్యాభిషిక్త శ్రీ జనకజాప్త.

ఉ. శ్రీరఘురామ భానుకులశేఖర మీపదపద్మసేవ మం
దారనగంబు ముంగిటే నిధానము తంగెటిజున్ను కొంగుబం
గారము వేల్పుమావికము కైవసమైనధనంబు చేరువౌ
మేరువు కామధేనువు సమీపసుధాంబుధి మాకునెప్పుడున్.

సీ. కట్టఁగాలువకదా కల్లోలినీభర్త
　　　చెఱకుఁబట్టిముగదా శివునిధనువు
కలువరేకులజోక గద సప్తసాలముల్
　　　పలుకుటీఁగెయొఁగదా తలఁప లంక
కందుకంబుగదయ్యె దుందుభికాయంబు
　　　కాలగీలనబొమ్మగద యహల్య
సూటికంబముగదా సురవైరిదేహంబు
　　　పెట్టుఁజెట్టుఁగదా విభీషణుండు

తెమవునకు నడ్డహా శేశతీవం ద్రుంచు
కరణిఁగద కబాధభూజనిఖండనంబు
నీకు నీమహాత్త్వంబు వర్ణింపఁదరమె
ప్రకటగుణసాంద్ర దశరథరామచంద్ర.

వ. అని సన్నుతించిన సంతసించి రామభద్రుండు నిర్నిద్ర తాత్ప ర్యంబున నమ్మునివర్యుని మస్తకంబున హస్తస్పర్శనంబు గావించి యోమునికులతిలకా! నీ భక్తికి మెచ్చితి. మచ్చరి తంబు భవ్యంబగు కావ్యంబుగా నొనరింపుమని యానతిచ్చి చనియె. అంత నవ్వాల్మీకి మహామునియు నాజానకీవల్లభుని భక్తి సులభత్వంబుఁ గొనియాడి సుధాబిందుబంధురతరంగ రింగణాధార ధారాంధర నిసువీణ మృదులపద సందర్భరస గర్భితార్థ చమత్కార పారాయణంబుగా రామాయణంబు వక్కాణించె నట్టి రామాయణంబు సకలలోక ప్రసిద్ధంబగు టెఱుంగుదురే కదా! ఇంక నేమివినవలతురని యడిగిన నమ్ముని పుంగవులందఱు నప్పర్వతుం బూజించి నీవలననిట్టి పుణ్యకథ వినంగలిగె, కృతార్థులమైతిమని సన్నుతించి వెండి యుఁ దత్కథావిశేషంబు ప్రశంసించుచుండిరంత.

క. శ్రీకరమై తగు నవ్వా
ల్మీకి చరిత్రంబు భక్తిమెఱయఁగ నెపుడున్.
చేకొని చదివిన వినినన్
చేకురు వారల కభీష్ట చిరశోభనముల్.

— గద్య. —

ఇది శ్రీరామచంద్రసాంద్ర కరుణాకటాక్షలబ్ధ సిద్ధసార
స్వతవిశేష, నిరర్గళ వాగ్వైభవాశేష, సరససాహిత్యకళాభోజ;
సత్యసంభాషిత ముఖాంభోజ, సకలసామ్రాజ్యధౌరేయ, నిత్య
వితీర్ణి ధారారాధేయ, నిరతావారితాన్నసత్రసంతోషితప్రతిదివస
పంచాశత్సహస్రభూసుర, బహువారావర్తిత మహాదానవైభవా
వర్తిత కీర్తిభాసుర, నిజమాంకితాకలంకవస్తుసమగ్ర, బహుళా
గ్రహారభూషిత, చోళధారామండలనిఖిలభోగవిభవనిర్జితాఖండ
ల సాధితసముద్రాంతరద్వీప ఖరనృపాలసంస్తుతప్రతాప, నేపాళ
భూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజపూజనీయధౌరంధర్య, రామ
సేతు శ్రీరంగవిజయరాఘవపురకుంభకోణాది దివ్యస్థలప్రతిష్ఠాపి
త రామభద్రసర్వజనసంభావిత, గాంభీర్యముద్రావినిర్జితసముద్ర
సదాశ్రితభరణ దీక్షాదక్ష, దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజ
సన్నుతాసాధారణశౌర్య దిగంతప్రసిద్ధతరౌదార్య సుజ్ఞానజనక
సతతసంసేవితజనక పోషితవిద్వత్కవియూథ, భువనశోభితగుణాస
నాథ, బలవత్పరిపంథిగృహీత సామంతమహీకాంతవిమోచనశ్లా
ఘనీయబాహాబల, మూర్తిమాంబాగర్భశుక్తిముక్తాఫల, చినదెవ్వ
నృపాలపుత్ర, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజిత కుసుమసాయక
సకలధర్మసంధాయక, రఘునాథనాయకప్రణీతంబైన వాల్మీకిచరి
త్రంబను మహాప్రబంధంబునందు

తృతీయాశ్వాసము.

# ఆంధ్రవిజ్ఞాన సమితి,

## విజయనగరము.

**అధ్యక్షులు, కోశాధిపతులు :**

రావుసాహేబు వేమకొమ్మ జి. సుబ్బయ్యపంతులుగారు,
బి. ఇ. యం. ఐ. ఇ,
చీఫ్ ఇంజనీయరు శ్రీ విజయనగరం ఎస్టేటు.

**ఉపాధ్యక్షులు :**

అడిదము రామారావు పంతులుగారు,
రిటైర్డు సీనియరు తెలుగు పండిట్, శ్రీ మహారాజావారి కాలేజి.

**కార్యదర్శి :**

గంటి సూర్యనారాయణశాస్త్రి,

**కృత్యసమాలోచనసమితి :**

మహ మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
తాతా సుబ్బారాయశాస్త్రిగారు,

శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామిగారు, యం. ఏ.,
ప్రిన్సిపాల్ శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల.

శ్రీమాన్ టి. నరసింహాచార్యులుగారు, ఎం. ఏ. యల్. టి.,
లెక్చరర్ భాషాశాఖ శ్రీ మహారాజావారి కాలేజి.

డాక్టరు, బుర్రా శేషగిరిరావు పంతులుగారు,
యం. ఏ. పిహెచ్. డి.,

ఆకుండి వేంకట శాస్త్రిగారు,
పండితులు, శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల,
ఆంధ్రయూనివర్సిటీ సెనెటు, ఎకడమిక్కౌన్సిలు, బోర్డాఫ్ స్టడీసు సభ్యులు.

## సమితియుద్దేశములు.



ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున నింతవరకెన్నియో యుద్గ్రంథములు వెలువడియున్నవి. వెలువడుచున్నవి. అవి యన్నియు ఆంధ్రవిజ్ఞానాభివృద్ధికి సహకారములగుచున్నవి, ఆంధ్రవిజ్ఞానస్రవంతిని ఆంధ్రావనిలో సర్వతోముఖముగ ప్రవహింపజేయదలంచి, మేమీ "ఆంధ్రవిజ్ఞానసమితి" ని నెలకొల్పినారము.

ఇందు ప్రాచీనాధునిక సారస్వత, చారిత్రిక, నైతికాది సంబంధ బంధురములగు హృద్య గద్య పద్యగ్రంథములు, సంవత్సరమునకు నాలుగింటికి తక్కువగాకుండగ ప్రచురించ నిశ్చయించితిమి.

శాస్త్ర సంబంధములగు ప్రాచీనగ్రంథములను, రసభరితములగు ప్రాచీన ప్రబంధరాజములను, అధునాతన కవిపుంగవులు, విద్వాంసులు, కళాభిజ్ఞులున్నగువారిచే రచియింపఁబడిన ప్రకృతోపయోగకములై గ్రంథరాజములను మా సమితికి పంపిన, వాటిని సవిమర్శముగ పరిశీలించి, ముద్రణార్హములగునేని వాటిని ముద్రించుటకు ప్రయత్నించెదము. ఇంతియేగాక, ముద్రితగ్రంథములవలన లభించినలాభములో కొంతపాలు తద్గ్రంథాధికారికి కోరినచో లభింపగలదు.

సమితి యాదాయమంతయు, గ్రంథప్రచురణకు, గ్రంథకర్తలకు ప్రాచీన గ్రంథసంపాదనకు వినియోగింపఁబడఁగలదు, గాన ఆంధ్ర భాషాభిమానులు, ఆంధ్రభాషోద్ధారకులు, ఆంధ్ర విజ్ఞాన సంవర్ధకులగు ఆంధ్రమహాశయులు మాయీ సమితిలో పోషకులుగను, చందాదారులుగను, చేరి, మా యుద్యమమునకు చేయూత నొసంగి, మాతోడ్పడి భాషాభివృద్ధిని చేయుదురుగాక యని యాశించుచున్నారము.

---

## నిబంధనలు.

పోషకులు:- సంవత్సరమునకు 10. రూపాయిలు తక్కువగాకుండగ నిచ్చువారు మా సమితికి పోషకులుగ పరిగణింపఁబడుదురు. సమితినుండి వెలువడిన గ్రంథములన్నియు వినామూల్యముగ పొందగలరు.

చందాదారులు:- సంవత్సరమునకు 4- రూపాయిలు ముందుగా ఇచ్చువారు చందాదారులుగ నుండగలరు. సమితివారే తపాలాఖర్చులను భరించి గ్రంథముల నందింపజేయుదురు.

చందా నిచ్చువారు తప్పక రశీదును పొందవలెను. చందాసొమ్ము అధ్యక్షుని పేరిట పంపవలెను. గ్రంథములు వి. పి. గా పంపఁబడవు.

చందాదారులుగా చేరని యితరులకు తపాలాఖర్చులుగాక గ్రంథము 1 రూపాయికి లభించగలదు.

ఆంధ్ర జ్ఞాన సమితి ప్రథమ గ్రంథరాజము.

# రాధామాధవసంవాదము

కలిదిండ్ల వేంకటపతి మహాకవి ప్రణీతము. శృంగార రసభరితము.

(1700 సంవత్సరపు కృతి)

విక్రమ సంవత్సరారంభమున వెలువడినది.

ఆంధ్రవిజ్ఞాన సమితి - ద్వితీయ గ్రంథరాజము.

# విస్మృతకళింగాంధ్రకవులు

ప్రకర్త: అడిదము రామారావు పంతులుగారు.

ఆ ప్రాపారస్యతాభ్యుదయ కారకులగు మహాకవుల జీవితచారిత్రాదికములను శ్రీ క. వీ. వీరేశలింగం గు. శ్రీరామమూర్తి పంతులుంవారలు తమకు లభ్యమైనంతవరకు స్వీకరించి, ముద్రించిరి. వారలకు లభ్యముకానట్టి యాంధ్రమును దనుదాహరించిన కవిపుంగవుల జీవితవృత్తాంతములను, వారలగ్రంథములను సంపాదించి, సవిమర్శనముగ వారివారి చరిత్రములను వ్రాసి యీసమితి ద్వితీయ గ్రంథముగ ప్రచురించుచున్నారము. ఈగ్రంథము గద్యపద్యాత్మకమై సకల జనానందకరమై వెలయుచున్నది.

## 1700 మొదలు 1900 వరకు.

కృతికర్త - కృతులు.

1. శ్రీ పూసపాటి తమ్మభూపాలుడు - శ్రీకృష్ణవిజయము.
2. పెనుమళ్ళ సోమమంత్రి - సీమంతినీ కల్యాణము.
3. శ్రీ పూసపాటి వేంకటపతిమహీపాలుడు - ఉషాభ్యుదయము.
4. అడిదము బాలభాస్కరకవి - శుద్ధాంధ్రరామాయణము, లక్షణసారము (సూరకవి జనకుడు)
5. గోకులపాటి కూర్మనాథకవి - వరాహలక్ష్మీనరసింహశతకము, మృత్యుంజయవిలాసము, (యక్షగానము) చోరసంవాదము.

మున్నగు కవుల జీవితచరిత్రాదికము ప్రథమసంపుటముగ వెలువడినది.

ఆంధ్రవిజ్ఞానసమితి తృతీయగ్రంథము.

# వాల్మీకిచరిత్రము

తంజావూరు-రఘునాథరాయ ప్రణీతము.

ఇందు, మహర్షుల తపఃప్రభావములు, నారదసమాగమము, వివిధ క్షేత్రమహిమాభివర్ణనము, వాల్మీకివృత్తాంతము, ఆదికవిపుంగవుని దైహికాముష్మిక జ్ఞానసమాలోచనము, రంభోర్వశుల గర్వభంగము, బోయలచర్యలు, మున్నగు విషయములు స్వభావోక్తిగ వర్ణింపబడినవి. రఘునాథభూపాలుని కవిత్వము చమత్కారపదభూయిష్ఠమై, పండితపామర కర్ణరసాయనమై మృదుమధురశైలితో నొప్పి, యౌచిత్యపోషకమై యెంతయు మనోహరముగ నున్నది.

అధ్యక్షులు,

**ఆంధ్రవిజ్ఞానసమితి**

విజయనగరము.

ఆంధ్రవిజ్ఞానసమితి నాల్గవగ్రంథము.

# ధర్మజ్ఞచరిత్ర

కృతికర్తలు:—శ్రీ వేపకొమ్మ గురువేంకటసుబ్బయ్యగారు:
శ్రీమతి వేపకొమ్మ ఆదిలక్ష్మమ్మగారు.

ఇది మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, తాతా సుబ్బరాయశాస్త్రులవారి యుపోద్ఘాతయుక్తము భక్తిరస భరితము.

ఇందు, కైలాసగిరి శిఖరమున, నుమామహేశ్వరులు కొలువుదీరియుండ, శ్రీమహావిష్ణువు శివభక్తుండగు ధర్మజ్ఞుని యుదంతమును పార్వతికి చెప్పుట, ఆశ్రమంబులలో గృహస్థాశ్రమమే యుత్తమమైనదనియును, గార్హస్థ్యమునుండి ముక్తిని బొందవచ్చుననియును, పంచాక్షరిమంత్ర ప్రభావము, ప్రాణాయామక్రమము, యోగపద్ధతి శివస్తుతి,. మున్నగునవి, భక్తిరసమొట్టిపడునట్లు వివరింపఁబడినవి.

కండచక్కెర ముక్కలవంటి పద్యపరంపర
మృదుమధుర పదకలితమగు వచనరచన
భక్తిరస సంభరితమగు కథాసంవిధానము
సచ్ఛీలురకు, సద్ధర్ములకు సర్వథా సదాశివప్రదము.

ఆంధ్రవిజ్ఞానసమితి,
విజయనగరము.

ఆంధ్రవిజ్ఞానసమితి ద్వైదవగ్రంథము (అచ్చగుచున్నది)

# రుక్మవతీపరిణయము

(ప్రౌఢప్రబంధము.)

రేకపల్లి సోమప్పకవి ప్రణీతము. (1750 సం॥ ప్రాంతము)

ఈ ప్రబంధరాజ మింతవఱకు ముద్రణభాగ్యమును బొంద లేదు.

పాండిత్యప్రకర్షకు,
పాఠక హృదయాకర్షణమునకు,
వివిధవిషయ సమీకరణమునకు
ఈకృతి సాహితీరత్నాకరమని చెప్పవచ్చును.

ఆంధ్రవిజ్ఞానసమితి,
విజయనగరము.

---

కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ.